Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
బ్రచురింపఁబడుచున్నది.

జానపాడు.


| | | |
|---|---|---|
| సంపుటము 21 | 1929 సం॥ అక్టోబరు నెల | సంచిక 7 |


విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, కందూరు.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, కమలాపురం.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామసింగుగారు - నెల్లుట్ల.
౫ ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు - ఆత్మకూరు
౬ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

## పోషకులు.

౧ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరు జమీందారుగారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్తారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ టి, లక్ష్మణసింగుగారు, జనగాం
౧౦ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౧ పిలుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, దుగ్గందూరు.
౧౩ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఆరుమూరు.
౧౪ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౫ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౬ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు-దేవిడి.
౧౭ సాకుంట కిషన్‌రావు దేశముఖ్ గారు, జగితాల.
౧౮ కురికాల వెంకటేశ్వరరావుగారు. పరకాల.
౧౯ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

## సహాయులు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, పాపురం.
౬ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౭ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౮ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

చందాదారులు.




౧ సెనగల శేషగిరిరావుగారు - కోవాపరేటివ్ ఇన్‌స్పెక్టర్
౨ పుచ్చా పట్టాభిరామయ్యగారు - తుమ్మలచెరువు [పిడుగురాళ్ళ.
౩ చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు - గుడివాడ
౪ లక్కరాజు గోపాలరావుగారు - హెడ్డక్లార్కుంటెంటు - తెనాలి
౫ తూములూరు కోటయ్యగారు - పినపాడు
౬ కురుగంటి పున్నయ్యగారు - వకీలు - వంగోలు
౭ మైలవరం కృష్ణమూర్తిగారు - కంట్రాక్టరు - యేలూరు
౮ కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు, భాస్కరపంతులు - యేలూరు
౯ వేలమూరి వెంకటసుబ్బారావుగారు సబ్ జడ్జి - యేలూరు
౧౦ పాటిబండ వెంకటరమణయ్య పంతులుగారు, వకీలు - బెజవాడ
౧౧ అద్దేపల్లి వెంకటప్పయ్యగారు - మర్చెంటు - బెజవాడ
౧౨ సి. విఠ్ఠలరావుగారు - దివాణ్ దేవిడీయుద్యోగి - హైదరాబాదు
౧౩ సరావు వాసుదేవరావుగారు - అనంతవరం
౧౪ రాఘవరావుగారు - మునగాల
౧౫ రామారావు దేశపాండ్యాగారు - తేరుపల్లి
౧౬ లక్ష్మణరావు దేశపాండ్యాగారు - మల్లెపల్లి
౧౭ గుడికందుల నారాయణరావుగారు - కొల్లూరు
౧౮ రాఘవరెడ్డిగారు - యామున్జాల
౧౯ జెగర్లపూడి అమరనాథశాస్త్రిగారు - సికింద్రాబాదు
౨౦ చిప్పకుల వెంకటాచలశాస్త్రిగారు - సికింద్రాబాదు
౨౧ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు - సికింద్రాబాదు
౨౨ మల్లావఝ్ఝల రాజగోపాలంగారు - భువనగిరి
౨౩ రాపర్తి కృష్ణయ్యగారు - నవాబుపేట
౨౪ మొసలి పాపిరెడ్డిగారు - కొమ్మేపల్లి
౨౫ పాపయ్యాదొరవారు - బమ్మెర
౨౬ నారాయణరెడ్డి దేశముఖుగారు - చినమదూరు
౨౭ ఆగంరెడ్డి మొకద్దంగారు - నాగిరెడ్డిపల్లె
౨౮ గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు - ఇటికాలపల్లె
౨౯ సుద్దాల లక్ష్మారావుగారు - గొందుగుల

౩౦ సింగీతం అమృతరావుగారు - మక్తేదారు - కొన్నె
౩౧ తాండ్ర రాజారెడ్డి దేశముఖుగారు - అంకిరెడ్డిపల్లె
౩౨ సుందరగిరి నరసింగరావుగారు - కరణం - కళ్ళైపల్లి
౩౩ రంగరాజు వరదయ్యగారు - వంగపాడు
౩౪ దేవరాజు లక్ష్మీకాంతరావుగారు - ఆత్మకూరు
౩౫ బేతవభట్ల రామచంద్రశాస్త్రిగారు - రంగశాయిపేట
౩౬ వకీలు వెంకటరెడ్డిగారు - బొంపల్లె
౩౭ రామరాజు వెంకటగుండేరావుగారు - బొమ్మరాజుపల్లె
౩౮ రాజా విక్రమదేవవర్మగారు - విశాఖపట్టణం
౩౯ దంటు లక్ష్మీకాంతరావుగారు - సుద్దపల్లి
౪౦ కంచిరాజు లక్ష్మీనరసింహాంగారు - వకీలుగుమస్తా - కడప
౪౧ లోకుర్తి రాఘవాచార్యులుగారు - కేశవవాచకాలయము -
౪౨ భాగవతుల సూర్యనారాయణగారు - కొల్లూరు [కోడంగలు
౪౩ పూటుకూరి కోటయ్యగారి కుమారుడు వెంకటేశ్వర్లుగారు-చీరాల
౪౪ తిరుక్కోవళ్లూరి చక్రపాణిగారు డిప్టీకలెక్టరాఫీసుక్లార్కు -
౪౫ బి. వి. నంజుండయ్యగారు - బెంగుళూరు [నర్సారావుపేట
౪౬ పట్టాభిరామస్వామిశాస్త్రిలుగారు - భాస్కరపంతులు - బళ్లారి
౪౭ పిల్లుట్ల లచ్చురాజుగారు - రివిన్యూయినస్పెక్టరు - ఏనుగుపాలెం
౪౮ పుల్లాపంతుల రామచంద్రయ్యగారు, ఆనరరీమేజిస్ట్రేట్-కర్నూలు
౪౯ చిపురుల శ్రీరామశాస్త్రిగారు - చీమకుర్తి
౫౦ గుండు శేషయ్యగారు - స్కూల్మేష్టరు - చేటపట్టు
౫౧ చిపురుల వెంకటశాస్త్రిగారు - వంగోలు
౫౨ కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారు - ప్లీడరు - నర్సారావుపేట
౫౩ భువనగిరి ముకుందరామయ్యగారు - డిప్టీకలెక్టరాఫీసుసెకండు
క్లార్కు - నర్సారావుపేట
౫౪ బెల్లంకొండ హనుమంతరావుగారు - వమిడిపాడు
౫౫ ఇంగువ వెంకటసీతారామశర్మగారు - నెల్లూరు
౫౬ చతుర్వేదుల నరసింహయ్యగారు - విప్రులపల్ల్యగ్రహారము

# అభినవ సరస్వతి

సంపుటము ౨౧ | జానపాడు<br>శుక్ల సం॥ ఆశ్వయుజమాసము | సంచిక ౭

## " తంగెడ రామకృష్ణకవి స్మృతి "

మ॥ పలనాటంగల పండితోత్తములలోఁ బ్రఖ్యాతిచే మించి చె
న్నలరారన్ సుకవీంద్రసమ్మతిగ నానాగ్రంథముల్ వ్రాసి ని
స్తులకీర్తింగను సత్కవీంద్రు బుధవంద్యున్ రామకృష్ణార్యు నా
కలిదీరంగను మ్రింగితే యకట! దుష్కాలంబ! దుర్మార్గతన్॥

మ॥ తెలుగుందేశమునన్ సమస్తకళలన్ దీనత్వముంబొందు మా
పలనాటన్ దన సంస్కృతాంధ్రకవితాప్రావీణ్యముం జూపి యీ
తెలుగుంబాస సముద్ధరించిన మహాధీరుండు నీ సన్నిధిన్
నిలువంగావలెనంచుఁ బిల్చితె శచీనేతా! దివిన్ జేరఁగన్॥

ఉ॥ తంగెడరామకృష్ణకవి తల్లజ! స్వర్గముఁజేరినావె నీ
సంగడికాండ్రఁబుత్రముఖ సర్వుల వీడి యశశ్శరీరివై
వంగడమెల్ల సల్పితివి పావనమౌనటు నీదుజన్మచే
నింగిని నేలఁ బర్వె మహనీయ! భవద్గుణదివ్యకీర్తనల్॥

సీ॥ రాజకార్యధురంధరత్వంబునకు నీవు
సల్పిన యుద్యోగసరణి సాక్షి
పండితుండవటంచుఁ బల్క భవత్కృతం
బయిన గౌరీపరిణయమె సాక్షి
యీశుభక్తుఁడవని యెఱుఁగంగఁద్వన్నిర్మి
తంబయిన శివాలయంబు సాక్షి
పరులకు నుపకారివై మని తీవని
పల్కఁద్రవ్వించిన బావిసాక్షి

గీ॥ యిట్టిసత్కార్యము లజస్రమెన్నియేని సల్పితివివాని లెక్కింప సాధ్యమౌనె
యన్నిటినిబాసి దివికేగి తేవిధాన నకట తంగెడ రామకృష్ణాభిధాన॥

మ॥ అవనిన్ ద్వత్కృతకృత్యముల్ చిరములై యాచంద్రతారార్కమున్
కవిరాజన్యవరేణ్యవర్ణితములై గ్రాలున్ సదా నీకులో
ద్భవులెల్లన్ వసు సత్కళావిభవులై ధర్మాత్ములై మించుతన్
భవదీయాత్మకు శాంతిఁగూర్చెడిని శర్వాణీవిభుం డెప్పుడున్॥

వారణాసి లక్ష్మీనారాయణ.

———:(o):———

ఉ॥ శ్రీయును విద్యయున్ జనవశీకరణంబును గల్గి మేటివై
న్యాయముతోఁ జరించి భువియందున నుంటకు నిచ్చలేమి చే
కాయము వీడి తత్సురనికాయముఁ జూడ దృఢాభిలాషివై
పోయితివా పురందరుని ప్రోలికిఁ దంగెడ రామకృష్ణయా॥ 1

ఉ॥ ఏయదనందునైన నిను నేర్పడఁ జూచిన నీదుమేనిపై
మాయని బూదియుఁ వదనమార్గముగాంచిన నోన్నమశ్శివా
యా యను పల్కులున్ వినుదు మయ్యవి నేటికి వ్యర్థపుచ్చి హా
పోయితివా పురందరుని ప్రోలికిఁ దంగెడ రామకృష్ణయా॥ 3

ఉ॥ రాయసమాచు మీకవిత రాజిల దీటు జగాన గాన మేల్
మాయురె! ప్రీతిమై భువనమండలి వీడి సురల్ దిగుల్ పడన్
ధీయుతవర్యుఁడైన గురుధీరుని గెల్వ మహాభిలాషివై
పోయితివా పురందరుని ప్రోలికిఁ దంగెడ రామకృష్ణయా॥ 3

ఉ॥ హాయన బంధుకోటి బళిరాయన నల్పకవీశులెల్ల రా
రాయనఁ బండితుల్ కటకటాయన యాచకతండమెల్ల నా
హాయన మిత్రులందఱికి నన్నిగతుల్ గడియించి నేఁడు వే
పోయితివా పురందరుని ప్రోలికిఁ దంగెడ రామకృష్ణయా॥ 4

ఉ॥ మాయని దెద్ది? లోకములు మాఱినఁ గీరితి మాసినం జిర
స్థాయిగనుండు కావ్యములు దక్కనటంచని నిశ్చయించి శా
స్త్రీయముగాను గ్రంథములఁ జెప్పి యశస్సును స్వీకరించుచున్
పోయితివా పురందరుని ప్రోలికిఁ దంగెడ రామకృష్ణయా॥ 5

తంగెడ లక్ష్మీనారాయణ.

## కమ్మ కాఁపు తెలగ రెడ్డి వెలమశాఖీయుల కొకసలహా

అయ్యలారా!

ఇదివఱకు సాంఘికరాజకీయములందు మన మన్యోన్యసాహాయ్యముతోను నైకమత్యముతోను మెలంగుచుంటిమి. ఇపుడు పలువురు బ్రాహ్మణేతరులమనుచు బ్రాహ్మణులు తమ నన్నివిధముల నధఃపతితులఁ జేసినారని నిందింపసాగిరి. దీనికిఁ గారణము మా బ్రాహ్మణులే యని నొక్కి వక్కాణించుచున్నాను.

శ్లో॥ రాక్షసాః కలి మాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు
బ్రాహ్మణానేవ బాధంతే, తత్రాపి శ్రోత్రియాన్ ద్విజాన్.

అను నార్యోక్తిప్రకార మాసురీసంపదగల మా చతురాననసంతతివారగు జి. యస్. బి. సరస్వతియను నామాంతరముగల చదలవాడ రామకృష్ణయ్య, చిలుకూరు వీరభద్రరావు మున్నగు కొందఱు బ్రాహ్మణులు వర్ణసంకరసిద్ధాంతియగు దయానందుని యార్యసమాజములోఁ జేరి గుణకర్మములనుబట్టి జాతులేర్పడినవని వర్ణసంకరసిద్ధాంతమును బోధింపసాగిరి. ఇట్లే కృతయుగములో హిరణ్యాక్ష హిరణ్యకశిపులు కశ్యపబ్రహ్మసంతతి సోదరులు దైవసంపత్తిగల బ్రాహ్మణుల హింసయే చేసియుండిరి. త్రేతలోఁ బులస్త్యబ్రహ్మసంతతి వారగు రావణకుంభకర్ణులను సోదరులు మా బ్రాహ్మణులనే బాధించిరి. అయితే ద్వాపరములో "బ్రాహ్మణోమమదేవతా" యను బ్రాహ్మణపక్షపాతియగు శ్రీకృష్ణుని శిశుపాలదంతవక్త్రులు రాజవంశమునఁ బుట్టి పలువిధముల బాధించి యా శ్రీకృష్ణునం దైక్యమైనట్లు చరిత్రలుద్ఘోషించుచున్నవి. "కాని కలౌ వెంకటనాయక" యనునట్లీకలిలో మరల నీ సరస్వతీవీరభద్రావతారములు బయలుదేరి యార్యమతానుసారము తండ్రి శూద్రుఁ గొడుకు రాజు మనుమఁడు గుప్త మున్నగువారలఁగాఁ జేయుచున్నా" రని వాదింతురా ? అట్లగుచో "గొచ్చెర్లకోట వెంకటకృష్ణారావు బహదరు, రాజా, ఆఫ్ పోలవరము" గారు మొదలగువారికి బ్రాహ్మణక్షత్రియవైశ్యుల మువ్వుర గుణకర్మ

ములు నున్నవని యీకలిలో బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ముగ్వురు నగుదురని యనుట పొసఁగెనా? పొసఁగునా? యోజింపుఁడు. ముక్త్యాల జమీందారులగు వాసిరెడ్డి ముక్తీశ్వరప్రసాదుగారు ద్రౌపదీపరిణయమను గ్రంథమును బ్రస్తుతము జీవించియున్న చంద్రమౌళి ప్రసాదుగారు శ్రీకృష్ణభారతమును వెంకటాద్రినాయఁడుగారు పలు గ్రంథములను గృతులందిరి. జటప్రోలుసంస్థానాధిపతుల పూర్వులగు మాధవరావుగారు చంద్రికాపరిణయమును దోమకొండసంస్థానాధీశుఁ పూర్వులగు కామినేని మల్లారెడ్డిగారు శివధర్మోత్తరమను ప్రబంధమును వ్రాసిరి. మధురనాయకులగు వెంకటకృష్ణప్పనాయఁడుగారు వచనజైమినిభారతాదిగ్రంథరచనఁ జేసి చేయించిరి. అన్నిటియందుఁ దాము శూద్రులమనియుఁ జతుర్థజాతివారమనియు వ్రాయించిరి; వ్రాసికొనిరి. ఈచతుర్థజాతిపదమునకుఁ బొట్టకూటిసిద్ధాంతులగు బ్రాహ్మణులు నాల్గవతెగయని యేమేమో బట్టతలకు మోకాలికి ముడిపెట్టిన ట్లతకని యపార్థములు చెప్పసాగిరి.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రియోవర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో - నాస్తితు పంచమః॥

అని స్మృతులును బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులు శుద్ధయోని బీజసంభవులనియే వాకొనుచుండెను. చతుర్థజాతిని నాల్గవతెగయని యేవాఙ్మయములోను జెప్పియుండలేదు. ఇందలి సిద్ధాంతరాద్ధాంతములు సభాముఖమునఁ దేలఁగలవు. ఇఁక మన విరోధకారకులగు రెండవతెగవారు విశ్వబ్రాహ్మణులమను పంచాణ (కమసాలి) సంతతివారు. ఈపంచాణసంతతివారికిని జతురాననసంతతివారమగు మాకును బూర్వదేవదేవతలకువలె నాజన్మబద్ధవైరము. వారు మమ్ములను

గీ॥ తల్లి యూర్వశి లంజె. తనయాలు మాదిగె.
తాను బాపఁడాయె ధరణిలోన.
వసిష్ఠకులమును వసుధలో నెఱుఁగరా
విశ్వదాభిరామ! వినరవేమ!

అని నిందింపఁగా మేము వారిని

గీ॥ తల్లి డొక్కలజాతి తనయాలు మాలది
తాను విశ్వకర్మ ధరణిలోన
విశ్వకర్మకులము విశ్వమం దెఱుఁగరా
విశ్వదాభిరామ ! వినరవేమ.

అనియందుము. ఇరువురు వాదము చేసిచేసి కోర్టులకెక్కఁ దుదకు వారు విలోమసంతతివారనియు రథకారులనియు మేము చతురాననసంతతివారమనియు బ్రాహ్మణులమనియుఁ దీర్మానమైనది. పూర్వదేవదేవశబ్దములవలెను నాదిమాంధ్రాదిద్రావిడాదిశబ్దములవలెను నీ విశ్వబ్రాహ్మణ బ్రాహ్మణశబ్దము లిప్పటి కమలులోనున్నవి. కాని పంచానన చతురాననసంతతులు వేఱయినపు డీకఁ బోరాటమున కవకాశ మీయఁగూడదు. కాని మన సూర్యదేవర రాఘవయ్య త్యాష్టులగు విశ్వబ్రాహ్మణులవద్ద శ్రీగురుభ్యోనమయని వేద మభ్యసించి గురుదక్షిణగా విప్రచరిత్రయను గ్రంథాభాసమొకటి వ్రాసి యందు మావసిష్ఠుని లంజెకొడుకని తిట్టెను. మేము నట్లే "కసుమాలపుఁ గమ్మజాతి" యనిన మీ రూరకుందురా? జాతినిర్ణయమున కిట్టి యపభ్రంశము లేనా యాధారములు? వీని సతీర్థ్యుఁడనఁదగు వెలగల సుబ్బారెడ్డి 'ప్రచ్ఛన్నరాజకులచరిత్ర' మొకటివ్రాసి త్యాష్టుల శిష్యుఁడోయనునట్లు మా చతురాననబ్రాహ్మణసంతతినిందతో నింపెను. అనుపనీతక్షత్రియ ప్రచ్ఛన్నక్షత్రియ శబ్దములు పగటిభాగవతాది శబ్దములవలె నుపనయనరహితరాజులపరమని బోధయగుచుండఁగను గామినేని మల్లారెడ్డివ్రాసిన శివధర్మోత్తరములోఁ దాను శూద్రుఁడనని వ్రాసికొనియుండఁగను 'నింటివాఁడు వట్టిగేదెయనిన బయటివాఁడు పాడిగేదెయనె' ననుసామెతగాఁ బై సంకరసిద్ధాంతులు బొట్టకూటికవీశ్వరులును రెడ్డికులనిర్ణయాది గ్రంథములువ్రాయఁగా వానికై సొమ్ము వమ్ముచేసిన యిప్పటి దోమకొండ ప్రభువునకుఁ దమపూర్వుల నిజచరిత్రయం దభిమానమున్నటులఁ దోఁచదు.

ఇఁక నాంగ్లేయవిద్యావంతులలో బ్రిహ్మద్వేషమునకు మూందడుగువేసిన త్రిపురనేని రామస్వామిచౌదరిగారు వ్రాసిన శంబుకవధ

మా శ్రుతిధర్మసంజీవిని మున్నగు పత్రికలయందు విమర్శింపఁబడినది. వారువ్రాసిన సూతపురాణములో "విప్రుఁడా! బ్రాహ్మణేతర యువకులఁ గొండపల్లెకుం గొంపోయి పరాభవింపఁదలచితివిగా" యను సత్యేతరపువ్రాఁతలు వ్రాసిరి. కాకతీయరాజ్యాంతమందు బ్రాహ్మణేతరులను గొంపోయి యమరావతి కొండపల్లి కొండవీడు వెంకటగిరి మధురమున్నగు సంస్థానములకుఁ బ్రభువులఁ జేసి వారివద్ద విప్రులు మంత్రులయి కంటికి ఱెప్పవలెఁ గాపాడిరి. బ్రాహ్మణేతరయువకుఁడగు తనకు మా తిరుపతివెంకటేశ్వరకవులు సంస్కృతభాష నేర్పి శతావధాని బిరుదమొసంగినది మఱచి కృతఘ్నతగా విప్రులనే నిందింపసాగెను. 'వేదపాఠరతో విప్ర' యనున్యాయము ప్రకారము విప్రులమైన మాకు వేదోక్తమును 'సూతః పౌరాణికః ప్రోక్తః' యను న్యాయము ప్రకారము తనకుఁ బురాణోక్తము నని యెఱుంగక స్వవచనవ్యాఘాతవచనరచనఁ జేసిన పాశ్చాత్యచరిత్ర సిద్ధాంతియైన మన రామస్వామిచౌదరిగారా కమ్మవారిచరిత్ర వ్రాయఁబూనుట? ఇ దెంతనిష్పక్షపాతముగా నిర్దుష్టముగా నుండఁగలదో పాఠకులే గ్రహింతురుగాక. మేము శర్మలముగాన దేవాలయాదులయందుఁ దీర్థప్రసాదములు ముందు స్వీకరింపక తప్పదు. మీరు వర్మలయినచో గుప్తలకు బాధాకరము. మావసిష్ఠుని లంజకొడుకనిన రాఘవయ్యవ్రాఁతలకుఁ గినియని బ్రాహ్మణబీజోత్పన్నుఁ డుండఁడని గ్రహింపుఁడు. ఆయనయే బ్రాహ్మణేతరవిజయము బ్రాహ్మణసంఘాదర్శముగూడ వ్రాసెను. బ్రాహ్మణేతరశబ్ద మపశబ్దమని లోకజ్ఞానులందఱుఁ దలంతురు. ఏమన బ్రాహ్మణులుగానివారందఱు బ్రాహ్మణేతరులేకదా! అపుడు మన పంచమ భాగ్యరెడ్డివర్మయు బ్రాహ్మణేతరుఁడేకదా! చాకలిమంగలులతోఁ బూర్వసంప్రదాయానుసారము నామకరణఘట్టమందలి "దాస" పదసాహచర్యమున కొప్పని మీరు పంచముని వర్మశబ్దసాహచర్య మంగీకరింపఁదగునా?

౧౧ బ్రాహ్మణాధిక్యము తగ్గించుటకై మనుస్మృతి తగుల వేసినచోఁ బంచాంగము నశించిన నక్షత్రములుండునట్లు సాంఘికపుఁ గట్టుబాటుకు లోఁబడిన యన్నికులములు సక్రమముగ వర్తించును. మొన్నటి చెంగల్పట్టుసభవలె నాయుఁడు చౌదరి రావు మున్నగు కట్టుబాట్లు వదలినచోఁ దెగించినవానికిఁ దెడ్డేలింగ మనుసామెత యగునుగాని పొందులాభ ముండదు.

౧౨ బ్రాహ్మణేతరులలోని యంతశ్శాఖల సత్యచరిత్ర మెద్దాని నాధారపఱచుకొని వ్రాయుదురు ? గ్రంథములన్నియు బ్రాహ్మణులు వ్రాసినవేకదా ! ఇపుడు మా వీరభద్రరావు సరస్వతిగార్లువ్రాసిన బండ్రవ్రాఁతలు (శిలాశాసనములు) మున్నగు గ్రంథాభాసములు మోకాలికి బట్టతలకు ముడిపెట్టినవే ప్రమాణములా ? లేక మీమీ పూర్వులు వ్రాసి వ్రాయించికొన్న కృతులా ?

౧౩ అంతశ్శాఖావివాహములను పెద్దకమ్మ చిన్నకమ్మ పంట రెడ్డి యుప్పలపు టోరుగంటిరెడ్డి వెలమ యాదివెలమ మున్నగు నవాంతరశాఖాభేదములు మాని వివాహములాచరింతురా ? బ్రాహ్మణానా మనేకత్వమన్నట్లు బ్రాహ్మణులు భేదవాదులేకాని యిపుడిపుడు మా సరోజిని గోవిందరాజులునాయుని మారుక్మిణి యరండేల్ దొరను మాజానకి యబ్దుల్కరీముసాహెబును వివాహమాడి శాఖాభేదమే కాక కులభేదముగూడఁ ద్రోలఁగించి ముందంజవైచిరి.

౧౪ నిమ్నజాతులకుఁ దోడ్పడుటయనఁగా వారు దరఖాస్తు చేసిన బంజరుభూములకు మనము హంసాయీహక్కు గోరకుండు టయేకాన నట్లొనర్చి కార్యశూరులుగండు.

౧౫ జాతినిబట్టి యాధిక్యము మానుట బ్రాహ్మణులతోడనా ? లేక పంచమాదులతోఁగూడనా ? గుణకర్మములనుబట్టి జాతినిర్ణయించి

నచో నిపుడున్న జాతులుగాక యింక నిరువదియైదుజాతు లేర్పడును. ఇందువలనఁ దండ్రిమధ్వాచారి తనయుఁడారాధ్యుండగును. చేసి చూపుఁడు.

౧౬. రాజకీయసాంఘికములలో బ్రాహ్మణులతోపాటు మధ్య జాతులు నంత్యజాతులుఁ గలసిమెలసి యుండఁదగిన యీబ్రిటీషు ప్రభుత్వములోఁ గ్రైస్తవులను దమతోపాటు మోటూరులెక్క నంగీక రింపనివారా కార్యాచరణమునకుఁ గడంగుట? తనకంటెఁ బెద్దవానిని జిన్నవానినిగూడ మధ్యజాతి బూతులు దిట్టకుండుఁగాక.

౧౭. పార్లిమెంటు సంస్కరణలలో మనమందఱము నోటింగధి కారము పొందియుండ బ్రాహ్మణుల కోటీయవలదని యొక సాహసపు బోధ మనరాఘవయ్య చేసెను గాని పాములపాటి కంచర్ల పార్టీలుఁ గోగంటి చదలవాడ యడుసుమిల్లి లింగము మున్నగుపార్టీలుఁ దోడి రైతుల కష్టనష్టములారయుచున్నవా? ఏజండ్ల క్వారీలో బండిరాతిఖరీ దెనిమిదణాలుండఁగా నింకొక యెన్మిదణాలు టోలుగేటుఫీజు వసూలు చేయు మీరలా బాపనిక్యాండిడేట్లతోఁ బోటీపడుట? నెల్లూరు రెడ్లు గుంటూరు కృష్ణ గోదావరి కమ్మలు భీమవరమురాజులు నుండఁగా బ్రాహ్మణున కోటిచ్చుట? వెలగల సుబ్బారెడ్డియను యానాది (భూమంచి) రెడ్డి "ప్రచ్ఛన్నక్షత్రియకులప్రబోధ" యను పొత్త మొకటి వ్రాసెను. ఆయన మనరాఘవయ్యకు సతీర్థ్యుఁడగుటచే మావిరోధులగు త్వాష్ట్రులమాటలే చిలుకపలుకులుగాఁబలుకుచు మఱి కొన్ని కుయుక్తులు మీకుఁ బ్రబోధించెను. అవియు స్థాలీపులాక న్యాయముగానే విమర్శించెద.

౧౮. ప్రచ్ఛన్న క్షత్రియకులమనఁగా నిజమైన క్షత్రియులు కారనియు క్షత్రియాభాసశూద్రులనియు నాపదము పగటిభాగవతశబ్ద

మువలెఁ గన్పట్టెడిననియు మీరందఱు నందునిధాటి కోడి జన్నిదములు దెంపికొని శూద్రవృత్తి నవలంబించి సేద్యముచేసి జీవించుచున్నారనెను. సేద్యము వైశ్యవృత్తిగాన వైశ్యులు గావలసినది. ఇట్టి భావము లన్యోన్యవిరుద్ధములు. రెడ్డి కమ్మ వెలమ తెలగ శబ్దములు తెలుఁగు దేశ్యములుగాని తద్భవములుగావని యిదివఱకే వ్రాసియుంటిని. రారోడుశబ్దము రెడ్డియనియుఁ గూర్మశబ్దము కమ్మయనియు నిట్లుతలచుట్టుఁ దిప్పి ముక్కుఁబట్టనేల ? శివధర్మోత్తరము వ్రాసినమల్లారెడ్డి తాను జతుర్థకులసంజాతుఁడనన సంకరసిద్ధాంతియగు వీరభద్రరావు చతుర్థశాఖయని యాంధ్రులచరిత్రలో వ్రాయఁగా నది నిజమని నమ్మ నీ శివమెక్కినది. చతుర్థశాఖ రారోడునుండి వచ్చెనన్నఁ బంచమశాఖ యని యింకొకరన్న నేమందురు ?

౧౯ మేము మీయిండ్లకు దాహముతో వచ్చినచోఁ గంచు చెంబు తోమి పానీయమిచ్చెదమంటిరి. మీరు మాయిండ్లకు వచ్చినచో నిత్తడిముంతతో నిచ్చెదమంటిరి. మీరును మీకంటెఁ దక్కువవారు వచ్చినపు డిత్తడిముంతతోనే కాదు. మావలెనే చెంబెత్తి చేతిలో నీరు పోయుదురు. ఇదిగాక మీయిండ్ల మేము చల్ల పాలు త్రావుదుము. అవిలేనిచో వానితో శుద్ధిగాఁ గలసిన నీరు ద్రావుదుము. మీనీరు మీక్రిందిజాతులవారు త్రావుదురు. ఇది లోకశాస్త్రాచారము.

౨౦ మీరిచ్చిన యగ్రహారభూము లనుభవించి మిమ్ముఁ జులకనగా వాఁడు వీఁడని వాగుచుంటిమంటిరి. అది మాకు సహజమే. మీరును బంచమాదులచేఁ బాటుచేయించి వాఁడు వీఁడన నేల? మీ పూర్వులు మాచే శూద్రులని వ్రాయించుకొనుట కంగీకరించి మాకుఁ దాంబూల జాంబూనదాంబరాగ్రహారాదు లొసంగిరి. మీవలెఁ గృతఘ్నులయి తిట్లకారంభింప లేదు. "స్వదేశే పూజ్యతే రాజా" యన్నట్లు

వా రేమిచేసినఁ జెల్లదు? వెంకటాద్రినాయుఁడు దుష్టులైన చెంచుల దాయగట్టి నఱికించిన నెవరడ్డుపడిరి? అట్లే మేము దూషణతోఁ గృతులువ్రాసిన వా రొప్పుకొందురా? మీవలె వారు లుడితె భాయీలు గాకుండుటచేతనే సప్తసంతానములలో నొకటియగు కృతి నందిరి.

౨౧ మీయిండ్ల వివాహాదులలో మావారు సుమతిశతకాది పద్యములు చదివితే మీరు మామాన్యములలోఁ బసుగ్రాసనస్య ములువేసియు మీభూములలోఁ దోఁటపైరులువేసియు లాభముపొంది భరతన్నరాజ్యము చేయుట లేదా? మీవివాహములలోవలెనే మాలోని యజుశ్శాఖీయుల వివాహములలో గాడితొలిలోనుండి నీరుఁ బోయు దురు. ఇదియెఱుంగక మీకు నాగలికాడి తెప్పింతురంటిరి. 'బ్రాహ్మ ణస్య ధనంభైక్ష్యం' మన్నప్రకారము వడుగులో మాచే భిక్షమెత్తిం తురు. మీకు సేద్యమే ధనమగుటచే దానిపరికరములఁ బూజింపఁ జేయుదురు. వినాయకునిచవితినాఁడు వారివారి పరికరములఁ బూజించు నాచార మిప్పటికిం గలదు. అదియొక న్యూనతయా?

మన రాఘవయ్య స్వకులపౌరోహిత్యమును 'వార్తాకమైథున' గ్రంథములో బ్రాహ్మణులు పొట్టకూటికై దానాదులు కల్పించినారని నిందించుచు స్వకులపౌరోహిత్యములో దానాదులు తాము గ్రహిం చుటచూడ నత్త కోడలికి బుద్ధిగఱపి తాను ఱంకుఁజేసెనను సామెతగా నున్నది. ఇప్పటికే వ్యాసము పెరిఁగినదికాన బ్రాహ్మణేతరవిజయ బ్రాహ్మణసంఘాదర్శ రెడ్డికులనిర్ణయచంద్రికా ప్రచ్ఛన్నక్షత్రియ కుల ప్రబోధాది గ్రంథాభాసములు స్థాలీపులాకన్యాయముగా విమ ర్శింతము.

౧ బ్రాహ్మణేతరశబ్దమే యపశబ్దము. అందు బ్రాహ్మణేతరు లకు విజయమా? బ్రాహ్మణేతరులగు చాకలసుబ్బఁడు కుమ్మర

గుర్వాఁడు యానాది పోలఁడు మున్నగు నిమ్నజాతులవారు సుబ్బయ్య గారు గుర్వయ్యగారు పోలయ్యగారను నామగౌరవమైనను బొందఁ జాలకుండ బ్రాహ్మణేతరులకు విజయ మెక్కడ ?

౨ బ్రాహ్మణేతరసంఘాదర్శములోఁ గొసరాజు రాఘవయ్య చౌదరి బ్రాహ్మణకుంకలు బ్రాహ్మణేతరులను సంకరులని వ్రాసినా రనెను. కమ్మ తెలగ రెడ్డి వెలమ శాఖీయులు సంకరులని మెచటనేని వ్రాసిరా ? చూఁపుఁడు. మంగలి చాకలి మున్నగు నిమ్నజాతీయులను సంకరులని మనుస్మృతి వచించిన నది కృతయుగస్మృతి. దానికాలము గడచిపోయినది. నిమ్నజాతీయులందఱికిఁ గులగౌరవమిచ్చు గ్రంథము లిటీవల బ్రాహ్మణులు రచించి వారివారి యాచకులచేఁ బొగడించు చుండిరి. కాని నిమ్నజాతీయుల దండించునధికార మిపు డందఱు కుంకలుఁ బొందియున్నారు. బ్రాహ్మణులు నిమ్నజాతీయులను సంకరులని వ్రాసిరి. బ్రాహ్మణులను బ్రాహ్మణులు పరిహసించుటయేకాక రెడ్డిని మోటరెడ్డని తెలగను మున్నూటివాఁడని కాఁపులెల్ల వెలమ కమ్మలైరని బ్రాహ్మణేతరులును బ్రాహ్మణేతరులపట్లఁ బరిహాసోక్తు లాడుచుండిరి. అయ్యవి ప్రమాణములనుట తగునా ?

3 పూర్వమీవృత్తి వీనిదని నిర్ణయించినను నిపు డాంగ్లేయ ప్రభుత్వములోఁగాని పూర్వమహమ్మదీయప్రభుత్వములోఁగాని విద్యావంతున కుద్యోగాదులు గలవుగానఁ బలుజాతిజమీందారు లేర్పడిరి. మనుస్మృతిలోని బ్రాహ్మణేతరుల విద్య ధనము వృత్తి మున్నగునవి యీ కలిలో వర్తింపవు. అట్లే గుణకర్మములనుబట్టి జాతు లేర్పడవు. ఏర్పడినఁ దండ్రిమధ్వాచారి యనునట్లగును.

౪ విప్రపకృతనాశనరాజ్యములు కొన్ని పేర్కొనెను. కొండవీటిరెడ్లు కోమటివేమన్న పరుసవేది హరించి యాయనశాపముచే

నంబితంబళకరూప బ్రాహ్మణులచేఁ గత్తులబావిలో నశించిరి. ఇట్లే యిప్పటి మల్లెలవారు పణ్యారముసోదరుల నండగానుంచుకొని రాజద్రోహకరమగు తప్పుకి రెన్సీ మిషను పెట్టి ధనమానములు గోల్పోయిన దెఱింగిన రాఘవయ్య యిట్లు వ్రాయఁజనునా ?

౫ విప్రకల్పితముచే సాంఘిక దౌర్బల్యము కలిగినదనెను. రాజా వాసిరెడ్డివారు వీనియంత విద్యాధననీతికోవిదులు గారో ? ఇప్పటి ముక్త్యాల ప్రభువు మన్నెసుల్తాను చంద్రమౌళిప్రసాదుగారి నడిగి బుద్ధి తెచ్చుకొనుట యుక్తము.

౬ మఱియు దోమకొండప్రభువు కామినేని మల్లారెడ్డి జటప్రోలుప్రభువు మాధవరాయలు మధుర చేనప్పనాయకాదులు నింత సాంఘికాభిమానము కలవారు కారా యేమి ?

౭ విప్రులకు దానమిచ్చినవారు పరలోకసౌఖ్యము లనుభవింతురనుట కల్పితమైనచో నల్లూరి కమ్మపురోహితాదులు పట్టెడి దానాదులకు మేరలేదు సరికదా తాడిపట్లుపురోహితుస కుప్పకట్టలు శ్రాద్ధభోక్తతయందలి నిత్యాపూపభక్షణాదులు నటుండ నల్లూరివాని వాకిట దానధేనువులు గ్రాసములేక యంభారవములతో నఱచుచుండుట కనులారఁ గాంచుఁడు.

౮ బ్రాహ్మణునకు వంటచేయుట యుద్యోగము దానములు మున్నగువానిచేఁ గోట్లకొలఁది ధనము లభించుచున్నదని వగచెను. శూద్రుఁడైన జమీందారుకన్న బ్రాహ్మణోద్యోగి యెక్కువధనవంతుఁడా ? మఱియు నీకాలమున శూద్రమంత్రులు పొందెడి జీతము స్వసంఘోద్యోగప్రయత్నముఁ జూచిన నిట్లు వ్రాయునా ? ఇదిగాక బ్రాహ్మణేతరు లనువారు కూలిచే దొంగతనముచే నెంతగడించుచుండిరి? బ్రాహ్మణేతరులలో నెఱుకుల యేనాది సెటల్మెంటు లేర్పరచి ప్రభు

త్వము వారు విద్య నీతిఁ గఱపుచున్నను నీసెటల్మెంటులదరినున్న బాపట్ల మున్నగు నూళ్ళ వారికి నిద్రగలదా? వీరపహరించిన నగలు దాఁచిన భూస్వాములును గరఁగిన విశ్వబ్రాహ్మణులును మూఁడుపాళ్ళు హరించి నాలుగవ భాగమే కదా మరలనిచ్చునది !

౯ శూద్రుఁడు దేవపూజ చేయఁగూడదనిరని యింకొక దోషారోపణఁ జేసిరి. లోఁగడ వ్రాసినట్లు మనుస్మృతికాలమయిన కృతయుగములో నట్లు జరిగెనేమో కాని త్రేతలోని శ్రీరాముఁడు బ్రాహ్మణేతరుఁడైనను రామలింగేశుని బ్రతిష్ఠించిన గాథ గనుఁడు. ఆయనయే వసిష్ఠుని బోధ విని శంబుకుని వధించెనఁట. శంబుకుఁడు మీ ద్రావిడుఁడఁట. రాముఁడెవరు? ఇదెట్టి పాశ్చాత్య చరిత్రానుకరణము ?

౧౦ ఇఁక ముఖ్యసూత్రములలో మొదటిది స్వకులపౌరోహిత్యము. మా చేతిదర్భలు మీచేఁ బట్టి మీ శ్రాద్ధములు మీరు పెట్టుకొని మీ పిండపుఁగూడు మీరే తిని మీవల్ల కాదు మీరే వండించుకొనినచో నిదివఱకే మీచేతి ములుగఱ్ఱ మాచేతఁ గొందఱము పట్టి యాపద్ధర్మముగా దున్నుకొని బ్రతుకుచుంటిమి కావునఁ దక్కిన బ్రాహ్మణులు నట్లే తమ తమ మాన్యములు దున్నుకొని జీవింపఁగలరు.

౧౧ సర్వమానవులును వేదములు చదువవచ్చునని హరి చెప్పెనఁట. అట్లెచ్చటను జెప్పలేదు. బ్రాహ్మణక్షత్రియవైశ్యులను త్రైవర్ణికులును ద్విజులని వారికొఱకు వేదములు విభజించి స్త్రీశూద్రులకొఱకు " భారతః పంచమో వేద " యని సంస్కృతములో భారతము రచించిన వేదవ్యాసమహర్షి స్త్రీశూద్రులకు సంస్కృతము చెప్పవలదనె ననుటకు వలనుపడునా ? ఉట్టికెక్కలేనియమ్మ స్వర్గమున కెక్కలేనట్లు తొమ్మిదివందలయేండ్లనాఁటి తెలుఁగుభారతములోని తే॥ వెలఁది పానంబు జూదంబు, కం॥ ఒరులేయవి యొనరించిన

నరవర ! యప్రియము తన మనంబున కగు, కం॥ ఏవానిబంధుమిత్రులు నను పద్యములలోని యర్థము నాచరణయం. దుంచలేని వారలు వేదముచదివిన లాభమేమి ? మీరేలచదువుమనరన మాజాతికి విధివిహితము. మీకందురా ?

శ్లో॥ కపిలాక్షీరపానేన బ్రాహ్మణీసంగమేనచ
వేదాక్షరవిచారేణ శూద్రస్య నరకం ధ్రువం॥

అను ధర్మశాస్త్రము వలదన్నది. మిమ్ములను శూద్రులని మీపూర్వులు వ్రాసిరి. వ్రాయించిరి. అయ్యవి కృతులు. సప్తసంతానములలోఁ జేరినవి. బండవ్రాఁతలు (శిలాశాసనములు) పూర్వోత్తర సందర్భము లేనివి. పంచభూతములవలె సర్వభూతములు నుపయోగింపఁ దగినవి కావు వేదములు. అట్లని పంచములును నీ సర్వశబ్దములోని బ్రాహ్మణేతరులేకదా ! అట్లంగీకరించినచో వాదమేల ?

౨౩ పంచాంగములు చేఁబట్టిన పురోహితులు మీయిండ్లఁ దద్దినాల్పెట్టించి పాత్రలన్నియు గంపలోఁ దీసికొనివెళ్ళి దౌర్భాగ్యులిండ్లఁబట్టిన దానములవలని పాపము శమించుటకై హరినామస్మరణ చేసెదరఁట. బ్రాహ్మణునియింట భోక్తృత్వమువహించిన బ్రాహ్మణుఁడును నట్లు నామస్మరణ చేయును. దాసయని నామాంతమునఁ జేర్చుట నామకరణఘట్టములోని దాసపదముగాని భోజ్యాన్నఘట్టములోని దాసశబ్దముగాదని ధర్మశాస్త్రమర్యాద లెఱింగినవానికి వేద్యము. కర్ణంఛిత్వా గుదందహేత్ అను నశ్వవైద్యచికిత్సాప్రకరణమును భార్యపట్ల నుపయోగించినట్లగును. కానఁ బ్రకరణమెఱుంగవలె. ఎట్లన, భోజనకాలమందు 'సైంధవమానయ' యన నుప్పుతెచ్చి వేయవలె. భోజనానంతరము స్వారివెడలఁదలఁచి 'సైంధవమానయ' యన గుఱ్ఱమునుదెచ్చి నిల్పవలె. ఇట్లే శ్రుతిస్మృతుల కర్థములు ప్రకరణసిద్ధములు. చావునకుఁ జేయించు చన్నీళ్ళస్నానము పెండ్లిలోఁ జేయింతురనియుఁ గంకణసూత్రము ద్రెంతురనియు గౌరీదేవియని సన్నెకల్లును ద్రొక్కింతురనియు నింకను నేమేమో పలువిధములగు చొప్పదంటు ప్రశ్నలడిగెను. వీనికన్నిటికి వేర్వేఱుగ వ్రాయఁబూనినచోఁ గొన్ని

వాల్యాములగును ఈపనులన్నియు బ్రాహ్మణునియింటను జరుగునవే. మీకు హరివేణి (అరివేణి) కుండలుంచిన మాకు నాకబలికుండ సామానులుంచెదరు.

క్షాత్రధర్మము దుష్టశిక్షణాదులుగదా ! ఇవి మీమీపూర్వులు క్షాత్రవంతులయి చేసిరికాని మీరిపుడు మావారిని బడితెపూజలు చేయుచున్నారు. మీ వర్మశబ్దధారణము దేవాలయాదులలోఁ దీర్థప్రసాదములిచ్చుతటి గుప్తలగు వైశ్యులకు బాధాకరముగాని శర్మలగు మాకంతబాధలేదు. బ్రాహ్మణులైన వడగము బుచ్చివెంకటశర్మయు జాగర్లమూడి బ్రాహ్మణపురోహితులును నల్లానిచక్రవర్తుల నరసింహాచార్యులు నంబెరుమాళ్లాచార్యులు పల్లెరమూడిరంగాచార్యులు చాగంటి వీరభద్రియ లింగమయ్యవారు మున్నగు కుటుంబగురువులును గలవకుంట శేషాచార్యులు పెదప్రోలు సూర్యనారాయణరావు మున్నగు పండితులును శేషాద్రివెంకటరమణకవులును గావ్యకంఠ గణపతిశాస్త్రి జి యస్ బి సరస్వతి చిలుకూరు వీరభద్రరావు మున్నగు వర్ణసంకర (ఆర్యసమాజ) సిద్ధాంతులును మీకందఱికి వర్మబిరుదములు దగిల్చి పొట్టబోసికొనుచుండిరి. యుగరూపా హి తే ద్విజా యను నార్యోక్తి వృథయగునా? రాజభాషాకోవిదులై సంస్కృతప్రభావముగల యిప్పటి దోనుకొండసంస్థానాధిపతియగు రాజా రాజేశ్వరరావుగారు తనసొమ్ము వము చేసి వ్రాయించిన రెడ్డికుల నిర్ణయచంద్రిక విమర్శించుటకుఁ బ్రత్యేక మొకగ్రంథము వ్రాయంబూనితిమి. శ్రీవారి పూర్వులగు కామినేని మల్లారెడ్డిగారు వ్రాసిన "శివధర్మోత్తర" మనుగ్రంథములోఁ దన పూర్వులచరిత్ర (వంశావళి)లో నిట్లువ్రాసికొన్నారు చూడుఁడు.

సీ॥ అత్యుదగ్రరుచిసముద్యద్గ్రహానక్షత్ర తారకల్ కుసుమసంతతులు గాఁగ
భూర్భువస్స్వర్ముఖ్య భూరి చతుర్దశ భువనముల్ సత్ఫలనివహములుగఁ
బ్రబల కూలంకషాంభః ప్రపూరిత సముద్రంబులు మకరంద రసఝరులుగ
నబ్జజాది పిపీలికాంత నానాజీవ గణములు విహగాదికములుగాఁగ
గరిమఁగన్పట్టు నలవిరాట్పురుషకల్ప । కంబు తత్పాదమున నుర్విఖ్యాతిసరణి
నుదయమైమించె విబుధసమ్మదవిభూతి । నాలుగవజాతి పూర్ణసంతానరీతి.

మ॥ తెలిపిన్ రంజిలునట్టి నాలుగవజాతిన్ గోత్రసంఘంబులో
పలఁ గల్గం గమలాస్పదంబగుచు శుంభద్వాహినీమండిలో

జ్వలమై తఁగ ఘను లాశ్రయింపఁగను శేవం శాకనాడన్వయం
బలఘుస్ఫూర్తి యశంబునొందె భువి శ్రీ రాంభోధిచందంబునన్

ఆ॥ అట్టి పాకనాఁటియన్వయంబనెడు శ్రీ
రాబ్ధియందు నుదయమై తనర్చెఁ
గల్పభూరుహంబుకరణి రాచుళగోత్ర
మెలమి ద్విజులకెల్ల నిలయమగుచు॥

క॥ ఆరాచుళగోత్రమున న్నీరధవరేణ్యుండు కామినేఁ డుదయించెన్
భూరమణకటక తేజో రాజన్మహిమఁ బురుషరత్నంబగుచున్॥

ఇట్లు మల్లారెడ్డిగారే స్వయముగాఁ దెల్పియుండిరి,

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రియోవర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో - నాస్తితు పంచమః.

అను స్మృతిని వివరింపఁబడిన నాలుగుజాతులలో నాలుగవ జాతియని కంఠోక్తిగాఁ బల్కెను. ఇట్లే వెలమలనుగూర్చి మాధవ రాయలును గాఁపులను గురించి చేవప్పనాయునికుమారుఁడు వెంక టప్ప నాయుఁడును వ్రాసికొనిరి. ఇఁకఁ గమ్మవారు విష్ణుభక్తులగుటచే విష్ణుపాదోద్భవులని వ్రాయించుకొనిరని వ్రాసినదాని నాధారముగాఁ గొని మన రాఘవయ్య తన బ్రాహ్మణేతరవిజయములోఁ గమ్మవారు బ్రహ్మపాదమందుఁ బుట్టిరనికాని శూద్రులని కంఠోక్తిగాఁ గాని యే గ్రంథమందును వ్రాయుట కంగీకరింపలేదని యసత్యపువ్రాఁత వ్రా సెను. దానికిజవాబీక్రిందిపద్యములు దెల్పును. చూడుఁడు. అహల్యా సంక్రందనవిలాసము ములుగు పాపయారాధ్యవిరచితమై వాసిరెడ్డి ప్రభువుల కంకితముచేయఁబడినది. అందు

ఉ॥ పావనమైన యా నలువ పాదసరోజమునందు సంతత
శ్రీ వెలయంగ సర్వగుణసేవితవైఖరిఁ గమ్మవంశ మా
గ్యావనతత్పరంబగు నయాఢ్యతనొప్పెఁ - దదన్వవాయమం
దీవసుధాతలంబున నభీష్టమహావిభవానుభావముల్॥

బ్రహ్మశ్రీ తాతంభట్టు గురుమూర్తిశాస్త్రిగారిచే రచియింపఁ బడి శ్రీ ముక్త్యాలసంస్థానాధీశులకుఁ గృతియీయఁబడిన "కృష్ణా మాహాత్మ్యమను" గ్రంథములోఁ గృతిపతుల వంశావతారఘట్టములో

సీ॥ నారాయణుని దివ్యనాభిపద్మమునందు నలుమోముదమ్ముల నలువ పుట్టె.
అమ్మహాత్ముని ముఖమందు విప్రులు భుజమున రాజు లుదయించి రనఘమతులు.
వరయశస్సాంద్రులు వైశ్యకులోత్తము లుత్సంగతలమున నుదితులైరి
పరమపవిత్రమౌ పాదాంబురుహమందు శూద్రులు గలిగిరి సుభగమతులు.
విధిముఖభుజోరుపాదారవిందములను । జనన మీరీతిఁ గనె నాల్గుజాతు లందుఁ
బాదసంభవకులములోఁ బ్రణుతిఁ గాంచె । వాసిరెడ్డ్యన్వయము చాల ధన్యకెక్కె.

ఈప్రకారము కమ్మ కాఁపు రెడ్డి వెలమవారి పూర్వులు వ్రాసి వ్రాయించుకొని యుండఁగాఁ దనకున్న యిరువదిమూఁడుయకరము లీ దురుద్యమములో ఖర్చుచేసి వార్ధకమైథున ముష్టిమైథునములవలెఁ గుక్షింభరత్వమునకై స్వకులపురోహితత్వ మంగీకరించి మాప్రతిపక్షులును బూర్వదేవతలును నగు త్వాష్ట్రులకుఁ బాదసేవకుఁడయి వేద మభ్యసించి యట్లే మిమువంటివారికి బోధించుచు మాకులగురువగు వసిష్ఠుని లంజెకొడుకు మున్నగు నాడరానిమాటలాడి మనరాఘవయ్య మాసంఘమును మఱిమఱి తూలనాడఁగడఁగెను. కోసరాజు రాఘవయ్యచౌదరి వెలగల సుబ్బారెడ్డి పక్కతాళములు వేయసాగిరి. మన చదలవాడ నాగభూషణుఁడు నాగదష్టుఁడయి తుదిపల్కులుగా మమ్ము బండుబూతులుదిట్ట నారంభించెను. తిపిరినేనిగృహనామము మార్చి త్రిపురనేనిగృహనామాంతరుఁడగుటచేఁ ద్రిపురాసురభావ ముద్రేకించుటయు నరణ్యములపాలయి కీడులో మేలన్నట్టు సూతమహర్షి దర్శన మబ్బ సూతపురాణ శంబుకవధాదిగ్రంథములు వ్రాసి వేదవ్యాసులుం బోలె శూద్రుఁడైన తనకు సంస్కృతభాష నేర్పిన మా వెంకటేశ్వర కవినేని మదిఁదలంపక కృతఘ్నతగా విప్రుఁడా! యని మా విప్రజాతి నంతయు నిందింపనారంభించిన రామస్వామిచౌదరిగారు వీరందఱకు బారిష్టా (న్యాయవాది) యై యన్యాయవాదముచేయు గురువులయిరి. కాన "శఠంప్రతి శఠం కుర్యా"త్తను నీతిచొప్పున నేనును బ్రతిఘటన గ్రంథవ్యాసము లిదివఱకే కొందఱకు వ్రాసితిని. అయినను నామాట పెడచెవినిడి తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్ళను సామతెగా మా శ్రుతిధర్మసంజీవిన్యనుబంధమగు జాతివిభాగాదర్శమునకు సక్రమమగు జవాబీయక పెడమార్గమున మముఁదిట్టుటయే పరమావధిగాఁ గైకొని వ్రాయనారంభించిరి.

నేనును నట్లే వ్రాయఁబూనితిని. అట్లు వ్రాసితినేని మీరు సంఘాభిమానముచే నాపైఁ గినుక వహింపక మానరు. కోపము తాపమునకుఁ గారణము. తాపము బ్రహ్మహత్యకుఁ గారణమగునుగాన మా సరస్వతీ వీరభద్రాదుల దుర్బోధలఁ బెడచెవినిడి (సవిమర్శముగాఁ ద్రోసిరాజని) మీపూర్వుల శూద్రులని వ్రాసినవారు కుంకలో వ్రాసి వ్రాయించుకున్నవారు కుంకలో యించుకంత సంఘాభిమానముతో మదిఁ బరికించి పైన వ్రాసిన బ్రాహ్మణద్వేషులకు బుద్ధిగఱపి రైతు వృత్తిలో సోదరులమగు మనకుఁ గలిగిన కష్టనష్టములో నైకమత్యముతోఁ బాటుపడఁగోరెద.

శ్లో॥ చత్వారో ధనదాయాదా ధర్మాగ్నినృపతస్కరా
జ్యేష్ఠపుత్రావమానేన త్రయః కుప్యంతి సోదరాః.

అన్నట్లు ధర్మము దప్పితేని యగ్నినృపతస్కరులు బాధింతురు. (ఈమూవురు రాజరూపులై యపరాధపుశిస్తులు నన్యాయపుఁ బన్నులు మున్నగు రాష్ట్రబాధలు చేయుదురు) మన మన్యోన్యసహాయులమైనచో మనమొరలు ప్రభుత్వమువారి చెవి కెక్కఁగలవు. సంఘములో మనము పోరాడినచో రాజకీయములో లాభమొందఁజాలము. బ్రాహ్మణునకు నాల్గింట నొకభాగము సేరీ భూమి-మీకన్న బ్రాహ్మణేతరునకు నాల్గింట నొకపాలు బ్రాహ్మణుఁడమ్మిన యగ్రహారభూములుగలవు-కాన ముందున్నది మొసళ్లపండుగ యన్నట్లు రాఁబోవు సెటిల్మెంటులో మన కష్ట నష్టములు ప్రభుత్వము వారికి నివేదించుటకై మనవోట్లుగొన్న ఘనప్రతినిధుల నాశ్రయింపుఁడు. ఎచట నేసంఘమునకు మెజార్టీ గలదో వారిమాటయే చెల్లునుగాన నెల్లూరుజిల్లాను రెడ్లకును గుంటూరు కృష్ణా గోదావరీమండలములలోఁ గమ్మవారికిని మఱికొన్నితావుల రాజులు మున్నగువారికినే మెజార్టీ గలుగుటచే బ్రాహ్మణున కిఁక సాంఘికరాజకీయాధికారములు లభింపవు. లభించిన మీర లడుసుమల్లి లింగము కంచర్ల పాములపాడు మున్నగు భేదములతోపాటు బ్రాహ్మణ బ్రాహ్మణేతరభేదమును బెట్టుకొని బ్రాహ్మణనింద సేయవలదని సలహానిచ్చు మండ చినవెంకయ్య.

---

# శ్రీ భారతకవిదూషక హితోపదేశము.

ఉ॥ అన్నయలార! సుబ్బఁడొకఁడా చరనారఁదొకండు తెల్పియే
మున్నదొ కాని భారతమె యుత్తదికల్పిత మప్రమాణమం
చెన్నిరి రామకృష్ణ ముఖులెందఱొ ఖండనజేసి రిద్దియా
దున్నల నేమి యున్న నది దోసముగాక సుఖప్రదంబగున్ ॥

సీ॥ వర్ణాశ్రమాది ప్రభావాసహిష్ణులౌ
పెద్దలు దాని శాపించినట్లు
పరవేష భాషల మరగు సుందరులు సా
ధ్వీలలామలఁ బట్టితిట్టినట్లు
శిశ్నోదరాయత్తచిత్తులు పరమార్థ
మెంచు భక్తులను దూషించినట్లు
గ్రాంధికమహిమంబు గనని ప్రబుద్ధులు
మించి యద్దాని నిందించినట్లు
తే॥ ఆంధ్రదివ్యకవిత్వంబు నల్ల లేని
విద్దెపెద్దదూషించిన, విధినిపుడు
కుకవులెందఱో యాభారతకృతి కుకృతి
యంచుఁ దిట్టిరిపాపంబు వ్యర్థమానె ॥

ఆ॥ ఊరు గొప్పవార లేని ననేకవి
ధముల సంస్కృతస్థితకృతివితతి
సరిగఁజూచి దివ్యసరణి వచింపుఁడీ
యున్నగొప్పతనము నూడ్పఁదగదు ॥

సీ॥ ఆంధ్రాదికవివరు నష్టభాషావిదు
నవసి విబుధుని, నన్నయ్యబుధుని
నాంధ్రకవిబ్రహ్మ నాద్యాంధ్రకవిమిత్రు
వ్యవహారదక్షు దిక్కనమనీషి
సరసకవిఁ బ్రబంధపరమేశుఁ, బరమేశ
దాసు నెఱ్ఱన్న ప్రధానమంత్రి

దత్కవిత్రయరచితము శ్రుతిసమమునౌ
పరమపవిత్రాంధ్ర భారతమును

తే॥ మఱిఁ దదనుయాయులగు నాంధ్రసరసకవులఁ
జేర్చి మనసార నోరారఁ జేతులార
నెంచి దూషించి విలిఖించి యేనె ఘనుఁడ
నంచు మురిసెద వోకాంత! యక్కిరాజ॥

మ॥ అలనాఁ డాసభ నేమిపల్కితి వవిద్యాశేఖరా! కాంత! నీ
తెలివిన్ జూచినవారలే కవివరుల్ ధీరుండు మం॥ వెంకయా
మలచిత్తుండట నిన్ను నేమి యడిగెన్ మాటాడవేమంటివో
చలమున్ గర్వ మసూయ హీడి మనుమా ఛాత్రాదియుక్తుండవై॥

మ॥ అలనాఁ డాసభ నేమిపల్కితి వవిద్యాశేఖరా! జ్ఞప్తిలోఁ
గలదే? నీవటు దూలనాడుదువె యోకాంతా! కళాశాలలోఁ
దెలుఁగున్ నేర్పఁగనుంటినంచు నధికోద్వేలాభిమానంబుతోఁ
బలుకన్ బ్లూనకు మట్లుచేయని యెడన్ వాకట్టరే సత్కవుల్॥

చ॥ తెలివియె నీకునుండినఁ గృతిపరికరంబును జేయవేల? యే
పలుకులొ నాకునచ్చినటు వ్రాసితినందువె? చక్కనున్న వే?
తలపయి భారతంబిడి యథార్థముఁ జెప్పను కృష్ణమూర్తి శా
స్త్రిలడుగుదానికుత్తరముఁ జూపవదేల? వచింపుమోసఖా॥

చ॥ తెలివియె నీకునుండినఁగృతి పరికరంబును జేసి శేషనన్
లలితయశోధనంబులఁ జెలంగుము తెల్వి వసింపకున్నచోఁ
బలుకక ముసుగువేసికొని బ్రహ్మను వేడుము యంతెకాని యి
ట్లలఘుతరాంధ్రసత్కవుల వ్యర్థముగా శపియింపఁబోకుమా॥

తే॥ ఎవరి కబ్బముల్ జదువుట నేను గర్గ
భాగవతముఖకృతులను వ్రాయఁజాలి
యుంటినో యట్టికవులకు నోరిగలిడెదఁ
జందురినకు నూలుపోగను సరణి నిట్లు॥



# శ్రీ భారతకవిదూషక హితోపదేశము.

ఉ॥ అన్నయలార! సుబ్బఁడొకఁ డా చరనారఁడొకండు తెల్వియే
మున్నదొ కాని భారతమె యుత్తదికల్పిత మప్రమాణమం
చెన్నిరి రామకృష్ణ ముఖులెందఱో ఖండన జేసి రిద్దియా
దున్నల నేమి యున్న నది దోసముగాక సుఖప్రదంబగున్ ॥

సీ॥ వర్ణాశ్రమాది ప్రభావాసహిష్ణులౌ
పెద్దలు దాని శాపించినట్లు
పరవేష భామల మరగు సుందరులు సా
ధ్వీలలామలఁ బట్టితిట్టినట్లు
శిశ్నోదరాయత్తచిత్తులు పరమార్థ
మెంచు భక్తులను దూషించినట్లు
గ్రాంథికమహిమంబు గనని ప్రబుద్ధులు
మించి యద్దాని నిందించినట్లు

తే॥ ఆంధ్రదివ్యకవిత్వంబు నల్ల లేని
విద్దెపెద్దదూషించిన, విధినినిపుడు
కుకవులెందఱో యాభారతకృతి కుకృతి
యంచుఁ దిట్టిరిపాపంబు వ్యర్థమౌనె ॥

ఆ॥ ఈరు గొప్పవారలేని ననేకవి
ధముల సంస్కృతస్థితకృతివితతి
సరిగఁజూచి దివ్యసరణి వచింపుఁడీ
యున్నగొప్పతనము నూడ్పఁదగదు ॥

సీ॥ ఆంధ్రాదికవివరు నష్టభాషావిదు
నవని విబుధుని, నన్నయ్యబుధుని
నాంధ్రకవిబ్రహ్మ నాద్యాంధ్రకవిమిత్రు
వ్యవహారదక్షు దిక్కనమనీషి
సరసకవిప్రబంధపరమేశుఁ, బరమేశ
దాసు నెఱ్ఱన్న ప్రధానమంత్రి

దత్కవిత్రయరచితము శ్రుతిసమమునౌ
పరమపవిత్రాంధ్ర భారతమును
తే॥ మఱి దదనుయాయులగు నాంధ్రసరసకవులఁ
జేర్చి మనసార నోరారఁ జేతులార
నెంచి దూషించి విలిఖించి యేనె ఘనుఁడ
నంచు మురిసెద వోకాంత! యక్కిరాజ॥

మ॥ అలనాఁ డాసభ నేమిపల్కితి వవిద్యాశేఖరా! కాంత! నీ
తెలివిన్ జూచినవారలే కవివరుల్ ధీరుండు మం॥ వెంకయా
మలచిత్తుండట నిన్ను నేమి యడిగెన్ మాటాడవేమంటివో
చలమున్ గర్వ మసూయ వీడి మనుమా ఛాత్రాదియుక్తుండవై॥

మ॥ అలనాఁ డాసభ నేమిపల్కితి వవిద్యాశేఖరా! జ్ఞప్తిలోఁ
గలదే? నీవటు దూలనాడుదువె యోకాంతా! కళాశాలలోఁ
దెలుఁగున్ నేర్పఁగనుంటినంచు నధికోద్వేలాభిమానంబుతోఁ
బలుకన్ బ్రూనకు మట్లుచేయని యెడన్ వాకట్టరే సత్కవుల్॥

చ॥ తెలివియె నీకునుండినఁ గృతిప్రకరంబును జేయవేల? యే
పలుకులో నాకునచ్చినటు వ్రాసితినందువె? చక్కనున్నవే?
తలపయి భారతంబిడి యధార్థముఁ జెప్పుము కృష్ణమూర్తి శా
స్త్రులడుగుదానికుత్తరముఁ జూపవదేల? వచింపుమోసఖా॥

చ॥ తెలివియె నీకునుండినఁగృతి ప్రకరంబును జేసి భేషనన్
లలితయశోధనంబులఁ జెలంగుము తెల్వి వసింపకున్నచోఁ
బలుకక ముస్గువేసికొని బ్రహ్మను వేఁడుము యంతెకాని యి
ట్లలఘుతరాంధ్రసత్కవుల, వ్యర్థముగా శపియింపఁబోకుమా॥
తే॥ ఎవరి కబ్బముల్ జదువుట నేను గర్గ
భాగవతముఖకృతులను వ్రాయఁజాలి
యుంటినో యట్టికవులకు నోరిగలిడెదఁ
జందురినకు నూలుపోగను సరణి నిట్లు॥



# బాల్య వివాహ నిరోధ శాసనము.

బాల్యవివాహనిషేధశాసనము ప్యాసయినది. బిల్లునకు అనుకూలురు 67. ప్రతికూలురు 14. అనుకూలురు 67లో ప్రభుత్వసభ్యులు 41. ఎన్నుకొనబడినవారు 26, మదరాసు రాజధానినుండి ఎన్నుకొనబడిన సభ్యులలో బిల్లునకు అనుకూలురు 1. ప్రతికూలురు 5. నాయకుల యభిప్రాయములు.

## దివాన్ బహాదూరు టి. ఆర్. రామచంద్రయ్యరు, మదరాసు

ఈబిల్లు న్యాయశాస్త్రవిరుద్ధమయినది. బ్రిటిషుపాలితులగు జనులలో అధిక సంఖ్యగల స్త్రీపురుషుల మతాచారధర్మములను మనస్సులను పీడించుటకే యీశాసన మేర్పడినది-ఇదివివాహపవిత్రతను,జాతిస్వత్వమును నశింపజేయుటకే ఉపయోగపడును. ప్రభుత్వమువారున్నూ, ఎన్నికమెంబర్లలో కొందరున్నూ యీబిల్లు నెగ్గుటకుతోడ్పడి ఆర్థడాక్సు హిందువుల విశ్వాసమును కోల్పోయినారు జయిలుకు పంపినను జుల్మానాల వేసినను ఆర్థడాక్సుహిందువులు ఇదివఱకు చేయుచున్నట్లే ముందుకూడా తమ తమబాలికలవివాహముల నాచరించెదరు. మతాచారధర్మములను, ధర్మశాస్త్రములను నిరసించు రాజకీయనాయకులను మేము నాయకులుగా నెంచుటయేలేదు. మతాచార ధర్మముల నాచరించుకొను స్వాతంత్ర్యమునే నిర్మూలించుచున్నప్పుడు వీరు కలుగ జేసెడి డొమినియన్ స్వాతంత్ర్యముగాని, సంపూర్ణస్వాతంత్ర్యముగాని మాకక్కరయేలేదు వయోనిర్ణయసంఘమున్నూ, దద్విచారణపద్ధతియు, నిష్పాక్షికముగా లేదు. ఇదొకప్రహసనము. క్రొత్త రాజకీయపక్ష మొకటి స్థాపింపబడవలయును. వైసరాయిగారీశాసనమును అంగీకరించినప్పటికిన్ని ఇంగ్లాండులో ఈవిషయమును గురించి విమర్శించి తిరస్కరించుటకు తగిన యేర్పాటు త్వరలో చేయబడును.

## ౨. యస్. సత్యమూర్తి యమ్. యల్. సి. గారు

ప్రభుత్వ మెంబర్లందరియొక్క సపోర్టుతో (మతాచారములకు సంబంధించిన ఇట్టి) బిల్లు ప్యాసుఅయినదనగా యీ గౌర్నమెంటు ప్రభుత్వమునందు ఇకమీద అల్ప సంఖ్యగల వారిక్షేమమునకు తగిన సంరక్షణములేదని ఇందువలన స్పష్టమగుచున్నది. అధికసంఖ్యగలవారు తలంచినయెడల చిరకాలమునుండి తమతమపూర్వులు శ్రద్ధాభక్తులతో నాచరించుచున్న మతవిధులనుకూడ అల్పసంఖ్యాకులు చేసికొనుటకు వీలులేదని స్థిరపడుచున్నది. కాంగ్రెసునందు పూర్వాచారపరాయణులకున్నూ, సోషలురిఫార్మర్లకున్నూ విభేదము కలిగించుటకయి ప్రభుత్వమువారీయెత్తు నెత్తినారనితలంచుచున్నాను. ఇట్టిచిక్కులను తొలగించుటకే స్వరాజ్యప్రభుత్వమును స్థాపించుటకుపూర్వాచార పరాయణులు తోడ్పడెదరుగాక. మతాచారవిరుద్ధమయిన యీ దుష్టశాసనమును లక్ష్యపెట్టక ఇదివఱకు మామూలుగా జరుపుచున్నట్లే ముందుకూడా తమతమ బాలికలకు వివాహము నిర్భయముగా నాచరించుచు తమ ధైర్యమును ప్రకటించెదరుగాక.

## 3. ఏ. హెచ్. గజ్నవి. యమ్. యల్. యే. గారు

భారతశాసనసభకు ఎన్నుకొనబడిన మహమ్మదీయసభ్యులలో అధికసంఖ్యాకులు శారదావివాహశాసనవిషయము సభలో చర్చించునప్పుడుగాని, ఓట్లు తీసికొన బడునప్పుడుగాని వారేమియు జోక్యము కలిగించుకొనలేదు. అధికసంఖ్యగలవారిలో

చేరి అల్పసంఖ్యగలవారిని అణగద్రొక్కి ప్రభుత్వవైఖరియందు అసమ్మతిని తెల్పుటకే మహమ్మదీయసభ్యు లిటుల నొనర్చిరి.

ప్రభుత్వమువారీబిల్లునకు అనుకూలముగా సహాయమొనర్చి అధికసంఖ్యాకులగు హిందువులయొక్కయు మహమ్మదీయులయొక్కయు విశ్వాసమును కోల్పోయినారు. ప్రభుత్వమువారీవిధముగా మతాచారములకున్నూ, కుటుంబవిషయములకున్నూ, సాంఘికములకున్నూ, సంబంధించిన విషయములందు జోక్యముకలిగించుకొనుటను సరియయిన హిందువుడుగాని మహమ్మదీయుడుగాని సహింపజాలడు. ఈశాసనమును తప్పక అతిక్రమించితీరెదము కొందఱు రిఫార్మర్లను సంతోషపరచుటకై ఇటుల అధికసంఖ్యగలవారి మతాచారవిరుద్ధముగ చరించి వారిని అసంతుష్టులుగా చేయుట కొరివితో తలగోకుకొనుటతో సమానమని ప్రభుత్వమువారెరుంగుదురుగాక.

## వల్లూరి వెంకటరావుగారు

బిల్లుప్రకారము మగపిల్లవానికి 18 సం॥ లు వయస్సును నాడపిల్లకు 14 సం॥ల వయస్సును రాకపూర్వము వివాహముచేయఁగూడదు. అట్లు వివాహముచేసినవారును జేయించినవారును గ్రిమినలుకోర్టులో శిక్షకుఁ బాత్రులగుదురు. కానిక్రిమినలుకోర్టులోఁ గేసు పెట్టుటకుఁ బోలీసువారి కధికారములేదు. వివాహముజరిగిన యొక్క సంవత్సరములోపుగనే యెవరయినను నొకరు జిల్లా మేజస్ట్రేటుగారివద్దఁ గంప్లయింటు దాఖలు చేయవలసియున్నది. అట్టి కంప్లయింటు దాఖలయితేనేకాని మేజస్ట్రేటుగారు కేసు విచారించుట కవకాశములేదు. అట్టి కంప్లయింటొకసంవత్సరములోపుగా దాఖలు కానిపక్షమున ఎవరును శిక్షాపాత్రులు కానేరరు ... ... ... రజస్వలావివాహములు జరుగునప్పుడు ఆదంపతులకు కలుగు సంతతివారికి హిందూధర్మశాస్త్రప్రకారము న్యాయమయిన హక్కులు లేవనియు వారితల్లిదండ్రులవివాహము శాస్త్రబద్ధము కాదనియు వాదించుట కింకను అవకాశముగలదు ఈప్రశ్నలే కోర్టులలో రాగలవు. ఇట్లు వివాహములు శాస్త్రమునకున్న ఆచారమునకున్న వ్యతిరేకమనియు చెల్లఁదగినవికావనియు బుద్ధిసూక్ష్మతగల న్యాయవాదులే కోర్టులలో వాదించగలరు.

## కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

శారదాగారు (బిల్లు) దెచ్చిపెట్టినదిమొదలు మనవివాహపద్ధతులంగూర్చి ఆంధ్రపత్రికాధిపతి యొచ్చటనులేని యావేశమును దెచ్చికొని యింతలంతలుచేసి వింతలు విపరీతములునగు నభిప్రాయములఁ బ్రకటింప మొదలిడె. ఆంధ్రపత్రికాధిపతులు దేశాభిమాన మాననీయులేకాని కాలసందర్భముం బట్టి పాశ్చాత్యనాగరకతయందలి పైపై మెఱుంగులంగని యదియే మంచిదని భ్రమసి కేవల పాక్షికాభిప్రాయములకు లోనైరి. ఈపత్రికాతల్లజ మాంధ్రదేశమంతటను వ్యాప్తికలదగుటచే నాంగ్లభాషంగల పత్రికలు మున్నగువానిం జదువుకొని సత్యము గ్రహింపఁజాలనియాంధ్రులఁ గొంత మోసగించుచున్నది. ఆహేతువుచే వీరి విపరీతవాదములఁ గ్రమక్రమముగా సత్యనిర్ధారణార్థమై విమర్శించుచుండెద.

మ॥ ఒకపద్దెమ్మున కొక్కయేడయిన నాయుర్దాయ మీఁ జాలుప
ద్యకదంబంబును నూటనల్వది యిదే యర్పించితి న్నీ కిటన్
సుకమున్ గూర్ప నగమ్ము కర్చయిననున్ నూన్యాయువా డెబ్బదిం
టికిఁ బై, నఁతియ చాలు సౌఖ్యగరిమన్ దేలింపు కామేశ్వరీ॥ ౧౪౧

శా॥ నిన్నుం దిట్టుటయుం ఘటించెఁ గొమరున్నేఁ డుద్యదుత్పీడు నేఁ
గన్నారం గననేర కార్తియుతుఁడపంగాఁ జాల కోయమ్మరో?
"యిన్నింద్యంపుఁబనిం బొనర్చునను నీవే చంపి రక్షింపు మా
పన్నుం మత్సుతు నార్తిఁ బాపి" యనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥

శా॥ అయ్యయ్యో? యిదియేమిపాపము? కుమారాంబా సుతుల్లేరె? నీ
కియ్యార్తిం శిశు వెట్లుసైఁపఁగలఁ డీ ట్లేడ్పింతువే? భక్తులం
గుయ్యాలింపవె? యింతఘోరకలియే? కొంతేనిఁ జింతింపవే?
న్యాయ్యంబేకద? నా కిటుల్ సలుపుటల్ నాతల్లి? కామేశ్వరీ॥

మ॥ కడుపెల్లం జెఱువౌను గుట్టి వడునీకష్టమ్ము వీక్షింపఁగాఁ
గొడుకే కాదొకశత్రువే యను మిదే క్రూరుండు సైరింపు? నీ
యడుగుల్ గొల్చెడినాకు నీ విటులు ప్రాయశ్చిత్తమున్ జేసెదే?
తడఁబాటో? దయలేదొ? నిం గొలుచుటే తప్పౌనొ? కామేశ్వరీ॥

శా॥ 'సంతాన మ్మది వల్వ దేరికి నిఁకం సంతానమే వద్దు నే
సంతానమ్మును గాంచుమీఁద మిగులం సంతాపమున్ గంటి నా
సంతాపమ్మును దీర్ప నిప్పటికి మాశర్వాణికిం గా' దటం
చెంతో దీనముగా వచించుటది నీ కిష్టంబె? కామేశ్వరీ॥ ౧౪౫

మ॥ "గురుసంతర్దశనుండియైన రుజకుం గోపోపశాంతిన్ శివం
కరమౌరీతి ననుగ్రహింపు" మని వెన్కన్ గోరియున్నాఁడ, ని
త్తటి యుద్రేకము చూడనంతదనుకన్ దాళండు బిడ్డండు శాం
కరి? యీలోపునఁ గొంతశాంతి నెటులో కల్పింపు కామేశ్వరీ॥

మ॥ త్రుటి యొక్కొక్క యుగమ్ముగా నకట? పుత్రుం డుండె నోయమ్మ? సం
కట మంతంతకు హెచ్చి విచ్చలవిడిన్ గారింపఁగాఁ జొచ్చె నిం
తట నీ వడ్డముసొచ్చి రాహుగుణమున్ దగ్గించి యొక్కింతయు
క్కటికమ్మున్ బ్రకటించినన్ గలుగు సౌఖ్యం బంబ? కామేశ్వరీ॥

శా॥ నాకున్ సంస్కృతియం దనాదరము గన్పట్టంగఁ బుట్టించితే?
వీఁకన్ వీనిఁ గుమారుఁగాఁ బ్రతినిశన్ వీఁ డందుశ్వాసామయో
ద్రేకమ్ముం గని యోర్చు టెట్లు? కరుణోత్సేకమ్ము నూఁకొల్పి నా
శోకమ్మున్ సుఖపెట్టి నా కిడుము సంతోషంబు కామేశ్వరీ॥౧౮౭

మ॥ తమఆఖ్యాకుఁడు రాహుదుర్గ్రహము బల్దర్పమ్మునన్ బొంగి దుః
ఖము రెట్టించుఁ గుమారుపట్ల నిశలన్, గళ్యాణిరో? రాత్రిభా
గములం దెక్కుడు నీసహాయ మది నేఁ గాంక్షింతు, బిడ్డండు బి
క్కమొగంబై ధృతి దూలకుండనయినం గాపాడు కామేశ్వరీ॥

శా॥ గంటల్ రాతిరి యెన్ని కొట్టఁబడెనో ? కళ్యాణిరో ? వానిన
న్నింటి న్నే వినుచుంటిఁ బుత్రుకతన, న్నీసత్కృపాస్ఫూర్తి యే
వెంటన్ దాఁ బ్రసరింపదయ్యె, నెటులన్ వేగింతు నీకుఱ్ఱతో
నింటన్ గాపుర; మూర్తిఁ బోకడపరాదే? తల్లి? కామేశ్వరీ॥

శా॥ ఏదో మంచిఫలమ్ము నీకతన నా కీపద్యముల్ తెచ్చుఁ ద
త్ప్రాదుర్భూతి సుతామయప్రశమరూపం బే యగున్ దానిచే
నాదౌర్భాగ్యము శాంతిఁ జెందు, సుఖము న్నాకబ్బు నీకన్న? 'నే
తాదృగ్దైవత మెందు లే' దనుమహత్త్వం బబ్బుఁ గామేశ్వరీ॥

మ॥ 'ఇలువే'ల్పంచును గొన్నిగోత్రములవారే త్వత్పదాంభోజపూ
జలు సేయన్ గమకింత్రు ము, న్నిపుడు నాసంతానముం బ్రోచుచో
నిలయెల్లన్ భవదర్చకప్రకరమై యేపారు, సంతానవం
తులు నీచే నగుచుందు రెల్లరుఁ గృతార్థుల్ తల్లి? కామేశ్వరీ॥

ను। ను।గాం।కొ।బై ళభ వన్మహామహిమముఁ మాయింట నస్మత్పితా
మహి గామాంబికచేత వింటి మును పంబా? నీదునావేశ మ
మ్మహిళామాళి వహించి చిక్కడలునమ్మార్గమ్ములన్ జెప్పి యి
మ్మహి నీకుం దులలేమిఁ దెల్పెడిదిసుమ్మా? యమ్మ? కామేశ్వరీ॥

శా॥ 'నీపై నూరక యిన్నిపద్దెములు నే నిర్మింతునే? శ్రేయముల్
ప్రాపించున్ ధ్రువ' మంచు నామదికి ధైర్యం బబ్బెడిన్, రోగమో?
యేపింకన్ విడలేద, కారణ మదేమీ? రాహుదుశ్శీలమున్
బాపన్‌రామియొ? శ్రద్ధలేమియొ? కృపాభావంబొ? కామేశ్వరీ॥

మ॥ హిమవత్పుత్రి? గజాస్యషణ్ముఖసవిత్రీ? సర్వగీర్వాణరా
ట్ప్రముదారత్నసమర్చ్యమానచరణా? భద్రాత్మికా? భద్రదా?
శ్రమతాపాదిసమస్తరోగశమనీ ? సంతానసంరక్షిణీ ?
సుమనఃకల్పలతా? నుతు న్మనుపుమీ? జోహారు కామేశ్వరీ॥౧౫౫

మ॥ శివదాత్రీ? శివదివ్యదేహచిరవాసిబ్రహ్మచర్యావ్రత
ప్రవిభేత్త్రీ? కమనీయగాత్రి? సకలాపద్దుర్గతాచ్ఛేత్త్రి? స
త్కవయిత్రిష్టవిధాత్రి? భక్తజనసంతానార్తిసంహర్త్రి? మ
త్కవనమ్ముం గయికొమ్ము పుత్రునకు సౌఖ్యం బిమ్ము కామేశ్వరీ॥

మ॥ సకలేశాని? భవాని? శాంకరి? జగత్సంరక్షణాయత్తసాం
ద్రకృపాభాస్వర, సత్కవీశ్వరమనస్తాపాగ్నికాదంబినీ ?
వికచాంభోరుహనేత్ర? నీదయకు నువ్విళ్ళూరుచున్నాఁడఁ, బు
త్రకు రక్షింపఁగదమ్మ? గండ మెటులో దాటించి కామేశ్వరీ ॥

శా॥ నీకారుణ్యముకల్మి శ్వాసమయమా నీచారి నిర్జించి తాఁ
బైకిఁ గుఱ్ఱఁడు వచ్చి వర్ధిలినచోఁ 'ప్రాణావశిష్టుండు వీఁ
డీకల్మిం గనె, నంబ్రిపా' యనుచు నిన్నే యమ్మలక్కల్ నుతి
ప్రాకట్యమ్మునఁ జెప్పికొందురుసుమీ ? పల్మాఱుఁ గామేశ్వరీ ॥

శా॥ నీకారుణ్యము కల్గుటే కడమకానీ, కల్గునల్లంతలో
దూఁకున్ డొంకలఁబట్టి రోగములు, డిందున్ దాపముల్ పాపముల్,
చేకూరున్ బల మాయువున్ సుఖము, సుశ్రీ వర్ధిలున్, లోపమే
లేకుండ న్నిను నే నెఱుంగుదును దల్లీ? ప్రోవు కామేశ్వరీ?౧౫౯

శా॥ 'చాముండా' యనునామధేయము ద్విషత్సంహారముఁ జేసి యీ
భూమి న్నీకుఁ బ్రసిద్ధమై తెఱుఁగుచుఁ బుత్రార్తిసంహారమం
దేమాత్రమ్మును శ్రద్ధ కైకొనక న న్నీరీతి వేధించుచున్
'చాముండా' బిరుదం బపార్థకముగా సాధింతుఁ గామేశ్వరీ॥

శా॥ ఏమాహాత్మ్యుఁడో నన్నువంటియొకఁ డేదేఁ గోర్కెకై వేడ నీ
నీమాంద్యమ్మును వానికోర్కెయెడ నిట్లే చూపఁగా, భక్తుఁ డు
ద్దామక్రోధముఁ బట్టఁజాలక నినుఁ దాఁదిట్టె నేమో కదా !
'చాముండా' యని; యింక నేనియుఁ గృపన్ సాగింపు కామేశ్వరీ॥

మ॥ మిగులన్ భక్తులఁ గష్టపెట్టు టిదియున్ మెచ్చానె? యట్లైనచోఁ
'దెగితే లింగఁడు రాయి' గాదె? మది కుద్రేకమ్ము గల్గించుటల్
తగునే? తల్లిరో? నిన్నువంటికరుణార్ద్రాంబా మహామూర్తికిన్
బగవాఁడే? పసిపాప, నాకొమరునిన్ బాలింపు కామేశ్వరీ॥

శా॥ రెండేఁడుల్ చనవచ్చె, వ్యాధి యొకతీరీతిన్ విజృంభించె, నొ
క్కండున్ మం దగుపట్టదయ్యె, భిషజుల్ కష్టించి లజ్జించి రు
ద్దండార్తిప్రఖ్యాతిప్రవీణము భవద్దాస్యంబు తానంత వే
ఱొండు న్నాకిఁక నీదుసేవ వృథగా దోయమ్మ? కామేశ్వరీ॥౧౬౩

మ॥ హిమవత్పుత్రిక వైననిన్ గుఱిచి నే నిన్నాళ్ళు ప్రార్థింప మ
చ్ఛ్రమమున్ బాపఁదలంచి నీజనకభూప్రాంతమ్మునం దుండి యొ
క్కమహామూలిక పంపి తంబరో? యిటే కాకున్నఁ బంజాబుదే
శమునం దున్నయమూల్యమూలిక యొటుల్ సాధ్యంబు కామేశ్వరీ॥

—♦ వృక్షమాహాత్మ్యము ♦—

తే॥ అనుడు శూద్రుఁ డిట్టులనియెఁ. "చాతుర్మాస్యమునను సర్వవృక్షములను దేవ
తలు వసించుటయును దద్వృక్షరూపులై యలరుచుండుటయు మహాద్భుతంబు.
క॥ భగవానుఁడ! యేసుర లేనగముల నివసింతురో వినం గోరినవాఁ
డఁ. గరుణయుంచి సవిస్తరముగ వక్కాణింపు" మనుడు మునియిట్లనియెన్. ౯౦౫
ఆ॥ "అమృతమందు జలము నసఘ! చాతుర్మాస్య వేళల వృక్షరూప మెనసినురలు
దానిఁ ద్రావుచుందు. తత్పానమున మహాతృప్తియుగునుజుమ్ము దేవతలకు. ౯౦౬
సీ॥ ఎంతటిబలవంతు నేని యుద్ధంబునం దోహటింపఁగఁజేయు నురుబలంబు
బలము పెంపొందింపఁగలిగి దుష్ప్రాప్యమై యలరారునట్టి తేజోతిశయము
తేజంబునకు నంత తీసిపోవనిభంగిఁ గడు రుచిరంబైన యొడలికాంతి
కాంతికిం దగినట్లు కనుముక్కు మొదలైన సకలావయవముల సౌష్ఠవంబు
వాని కన్నిటికిని వన్నె వెట్టెడి లఘువిక్రమంబు గలుగు సక్రమముగ.
తృష్ణదీర్పఁదగిన కృష్ణాంశసంభవపానముననుజేసి వైజవనుఁడ! ౯౦౭
క॥ నిత్యామృతపానంబున సత్యముగం గలుగుతృప్తి స్వల్పంబ యగుక౯.
నిత్యముఁ జేయఁగఁబడు తత్కృత్యంబును భోజనముగఁ గీర్తింతురు బుధుల్. ౯౦౮
ఉ॥ కావున నాల్గుమాసములఁ గ్రాలుచుఁ జెట్ల జగద్ధితంబుకై
దేవతలుం బితాళ్ళఁ దమిదీరఁగ నీరమె త్రావుచుంద్రు. త
త్సేవన మెప్డుచేసినను శ్రేష్ఠమె. శౌరి పరుండఁ జేయు సం
సేవ మరిన్ విశేష. మటు సేవితమౌ తరు విచ్చు సౌఖ్యముల్. ౯౦౯
తే॥ నువ్వులును నీళ్ళుఁ బోసి యనోకహములఁ దడుపుచో నవి బహుకామదంబులగును.
క్షీరభూరుహములకు సక్షీరసలిలసేచనంబు శుభప్రద మోచతుర్థ! ౯౧౦
మ॥ తొలి నేఁజెప్పిన నాల్గుమాఁకులును చాతుర్మాస్యయం దెంతయున్
ఫలదంబుల్. వటుమాత్రయించి యజుఁడున్ గౌరప్రసూసాధ్యమై
వెలయుంగాంచు తిలంబునందు మని సావిత్రీమహాదేవియున్
వెలుచం బ్రాణుల కిచ్చుచుందు వరము ల్ప్రేమించి శూద్రాపతీ! ౯౧౧
సీ॥ అత్యంతపారిశుద్ధ్యముగల్గినవి తిలల్. ధర్మార్థములకు సాధనము తిలలు.
నిర్వాణహార్మ్యంపు నిశ్రేణికలు తిలల్. కల్మషపరిహారకములు తిలలు.
ప్రచురమైనట్టి సత్ఫలమిచ్చునవి తిలల్. బలువైరులనుదోల్చు నలులు తిలలు.
అఖిలపుణ్యంబుల నాదిమంబులు తిలల్. హరిహాయీ ద్యమరధాన్యములు తిలలు.

కాన దానంబు లన్నింటిలోనఁగూడ నుర్వి దిలదానమత్యంత ముత్తమంబు.
హరిపరుండ విశేషించి యర్చనీయ మా తిలదుగ్రపు స్వశ్రేయసార్థిచేత. ౯౧౩

తే॥ హేమసంయుక్తముగఁ దిల లిచ్చునెడల బ్రహ్మహత్యాదులుం బటాపంచలగును.
సర్వకార్యార్థములకును సాధనములు తిలలు. సావిత్రినాఁ బ్రోక్తములు ధరిత్రి.

ఆ॥ తిలలతోడ స్వపితృదేవతలకుఁ దర్పణంబు చేయనగు జనంబు నిత్య
మంతకంటెఁగూడ నల్లచాతుర్మాస్యమున విశేషముగను బొనరుచునది. ౯౧౪

సీ॥ తిలలతో హవనంబు సలుపఁగాఁ గలిగిన శ్రేయం బమేయమై చెలువుగాంచు.
తిలపాదపమున కంజలిసేసి కొలిచినఁ బున్నెంబు కొంగునందున్న హొన్ను.
తిలవినిర్మిత భక్ష్యముల నారగించిన ధర్మంబునకు నౌను దావలంబు
తిలపిష్టమున మేన నలుగిడుకొనియును సుకృతంబు నార్జించుఁజా జనంబు
శ్రద్ధఁ జేయు తిలల సంస్పర్శనమునను నగును వృషసనాథ మఖిలలోక.
మేలచాలఁదిలసమీక్షణకృత్యంబు వృజినహరము పుణ్యవృద్ధికరము. ౯౧౫

క॥ చాతుర్మాస్యం గృతమగు నేత త్తిలసేవనమున నిలఁగల మనుజ
వ్రాతము ప్రీతిం గర మనుభూతాఖిలసౌఖ్యమగునుబో పైజవనా! ౯౧౬

ఉ॥ భూతహితంబుపొంకై యవభూరుహ మాశ్రిత మింద్రుచేతఁ ద
త్ఖ్యాతయవార్చ స్పర్శనము దర్శనముల్ సుకృతాప్తి కర్హమౌ
హేతువులౌచు వర్తిలెడి. నీయవలం బితృతర్పణంబు సం
ప్రీతి నొనర్పఁగాఁబడినఁ బేరిమి నయ్యది యక్షయంబగుల్. ౯౧౭

సీ॥ సహకారవృక్షంబు రహిఁ బ్రజాపతులును మలయంబు గంధర్వకులపతులును
అగరును గణనాథుఁ డంబుధు ల్పిబ్బలి యక్షులు పున్నాగవృక్షరాజ
మతిమధురాగమం బంబుజబాణుండు నాగకేసరమును నాగరాజు
లగ్ని రక్తాంజన మనిలుండు పూగంబు సిద్ధు లూడుగుఁ దాండ్రిచెట్టు యముఁడు
పనస గుహ్యకులును బదరిని రుద్రుండు గుహ్యకేశ్వరుండు కొండగోఁగు
వకుళ మసురుండు వరుణుండు ఖర్జూరి నాశ్రయించియుంద్రు హరి పరుండ.

సీ॥ వసువులు పొరటి వర్తిలంచుచుందురు. మెఱుము లశోకంబుమీఁద మనెడు.
అశ్వినులు మెన్మెత్తయందున వసియింతురు గుగ్గులం బసురులకుల్ నివాస.
మెలమి విశ్వేదేవతలు మధూకంబుపై విహరింతు రిదెమాకు విడిడియనుచు.
దాసనప్రానిపై వాసంబుగావింతు రాదిత్యులెల్లప్పు డాస్థతోడ.

కిన్నరు ల్మరీచ మున్నతతాళంబుఁ జామరాన్వితంబు సప్తఋషులు
అంబుదంబులెల్ల జంబూమహీరుహం బనుసరించియుండు రవరజాగ్రి! ౯౧౯

క॥ జంబూద్వీపు వర్ణమునం దంబుజనాభునకుఁ దుల్య. మటుగానఁ దదీ
యంబులగు ఫలము లొసఁగి ద్విజుం బూజించినఁ జతుర్భుజుఁడు తృప్తిపడున్.

క॥ జంబూవృక్షముక్రింద ఘనంబుగ భూసురుల భోజనము చేయింపన్
పంబిన వేడుకఁ బురుషార్థంబులు నాలుగును శార్ఙ్గిదా దయసేయున్. ౯౨౦

శా॥ చాతుర్మాస్య సభార్యులైన ద్విజులన్ శౌచాన్వితంబై జనం
బేతద్భూజముక్రింద భోజనము చేయింపన్ బలిధ్వంసి సం
ప్రీతుండౌఁ. బురుషుండు నేరెడును లక్ష్మీనాథు ప్రీత్యర్థ మ
స్వీతార్థాంగిత వస్త్రభూషితముఁ గావింపం గృతార్థుండగున్. ౯౨౧

తే॥ రాత్రిలనుమాట నేరెడి పాప్తమగునో యెది వటాశోకభవమున నేరుపడునో
ఆఫలంబును నేరెడు నండ నొనరించు ద్విజభోజనంబునఁ గాంచు జనము.

ఉ॥ నేరెడుచెట్టుక్రింద నవనీసురులన్ భుజియింపఁజేయునాఁ
డారసి యేకభుక్తము సమాచరితవ్యము. వేయునేల. త
ద్భూరుహపూజనంబునను బుత్రులఁ బౌత్రుల నర్థజాతమున్
గూరి జనంబు దేనఁ బ్రతికూలము లేక వసింపఁగల్గెడిన్. ౯౨౩

సీ॥ స్వీక్రియమాణంబు జిల్లేడు సూర్యుచేతఁ ద్రిపత్రికమునఁ జందమఁడు మనెడి.
అంగారకునిచేత నాశ్రితం బల చండ్రి యుత్తరేణిని బుధుం డుండుచుండు.
రావి బృహస్పతి తావసించినవాఁడు. శుక్రుండు మేడిచెట్టాక్రమించె.
జమ్మి శనైశ్చరు సంతతావాసంబు. రాహుకేతులవి దూర్వయును దర్భ.
అతిపవిత్రి దూర్వ. పితృతర్పణోచిత. యచ్యుతునకు దయిత యన్వహంబు.
అంతకును విశేష మల్ల చాతుర్మాస్య. దానిగరిమ నుడువ వేనివశము. ౯౨౪

ఆ॥ పావనములలోనఁ బావనం బెయ్యది మంగళముల నేది మంగళంబు
ఏదిలేక పూర్తి నైనయదు శుభకార్య మట్టిదర్భ యగు మహాఫలదము. ౯౨౫

తే॥ యాజ్ఞికంబైన యెద్దాన నజహరీశు లాదిమధ్యాంతములను దా మధివసింత్రో
ముక్తికాముల కెయ్యది మోక్షరూప మట్టి దర్భద్రుమాఖ్యయు హోయిని డెడి.

ఆ॥ కడప చెట్లఁ దర్కగలవేల్పులెల్లరు ఘనుదు రెలమి నాల్గుమాసములను
తీఁగెలను వసింత్రు దేవతాసతులును గొలుచుప్రజలు కోరు కోర్కులిడుచు.

తే॥ కాన సర్వాత్మభావనతో నరుండు సర్వవృక్షంబులను మఱి సర్వలతల
ననుదినమును విశేషించి హరిపరుండు తలిని సేవింప జగమెల్లఁ దనియుఁ దాన.

సీ॥ వేదప్రతిముకంటె వృక్షసేవన మెంతయని యలక్ష్యము సేయఁజనదు వణిజ.
ఆలుబిడ్డలమీఁది యతిమోహమునఁబడి తరుసక్తి యొఱుఁగమి తగదు గృహికి
మునియైతినని సదా ముకుమూసికొని విటప్యర్చన విడఁగూడ దవనిమనికి
సన్యసించినవాని కన్యమేలయటంచుఁ జెట్ల నుపేక్షింపఁజెల్లదు యతి
ఎల్లవారుగూడ నల్లచాతుర్మాస్య వానిపూజ సేయవలసినదియె.
పూజితంబులైన భూజంబు లపవర్గదాయకంబులగును దప్పకుండ. ౨౯

ఆ॥ సప్తతంతుముఖర సద్ధేతువును వినా నఱకఁగూడ దొక్కనగముఁగూడ.
ముందె నఱకఁగూడ దందుఁ జాతుర్మాస్య. నింతకన్నఁజెప్ప నేమిగలదు. ౩౦

తే॥ ఏది ప్రశ్నించినాఁడవో యిపుడు నన్ను నెట్లు వేల్పులు దేవత్వ మెనసినారొ
అద్దియంతయు నీకు నే నానుపూర్వముగను వాక్రుచ్చినాఁడను సుగుణమహిత!

సీ॥ హరికి నివాసమై యంహోనిరాసమై రమణీయభాసమౌ రావియొకటి
విధికి నికాయమై విస్తృతచ్ఛాయమై మహనీయమై పొల్చు మఱ్ఱియొకటి
సమశైత్యకారియై సకలరుగ్ఘారియై విశ్వోపకారియౌ వేమునొకటి
భక్షణీయపలాశఫలపుష్పసహితమై విహితమౌ తింత్రిణీవృక్షదళక
మఱు కపిత్థ శ్రీఫలామలకానోకహములు మూఁడుఁ. జూడ యముని జూడ.
రఖిలపూజ్యుఁడైన హరి పూజితుండైన నఖిలజగమునకును నగును దృప్తి. ౩౨

—• శంకరుఁడు పార్వతిని బతిమాలుట. •—

తే॥ తాదృశుండైన కృష్ణుఁ డాధారముగను గృష్ణమధ్యాగ్రకులు నగు జిష్ణుముఖర
సకలదానవరిపులును సకలపాదపముల శయనింతు" రనుటయుఁ బైజవనుఁడు.

ఆ॥ "ఎవ్వఁడలుగ లోకమెల్లను క్షోభించు నట్టిశివునిపైనె యలిగి కాళి
శాపమిచ్చి యెటు ప్రసాదంబునడసెను మగుడ మగనివలన హానిచంద్ర! ౩౪

క॥ భగవానుండగురుద్రుం డగజయగు స్వభార్యయిచ్చు నా శాపం బె
ట్లుగ్రహించె? వికృతరూపుండగు తా దివ్యాంగ మేక్రియను ధరియించెన్?"

క॥ అనవుడు గాలవుఁడిట్లను. "ననిమిషు లంబికకు జడిసి యాత్మీయములౌ
ఘనరూపంబు లదృశ్యము వొనరిచి ప్రతిమలను మనిరి భూలోకమునన్. ౩౬

ఆ॥ విష్ణువినుతయగుచు విశ్వసవిత్రి యంహోనిహంత్రియైన యుమ ప్రసన్న
యుఱొయ్య వేల్పులకును. నావేలుపుల బలాత్కృతిని భవుఁడు శాప మెనయవలసె.

౯ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలిన్స్పెక్టరు, నర్సారావుపేట

౧౦ నారాయణరావుగారు, దాతారుపల్లె

౧౧ గంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు-సాపురం.

౧౨ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౩ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౪ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౫ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట

౧౬ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౭ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౮ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౯ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - కొమ్మాలపాడు.

౨౦ గంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

౨౧ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౨౨ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - కొత్తాపురం

౨౩ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౨౪ తాళ్ళపలిమ లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౨౫ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి

౨౬ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం

౨౭ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.

౨౮ కుంటపల్లి రామారావుగారు, సంగెం.

౨౯ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౦ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౩౧ కొండంభట్లగారి వెంకన్న గారు గుమ్మడిదల

౩౨ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం

౩౩ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు.

౩౪ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.

౩౫ కుంటపల్లి అమృతరావుగారు-సంగెం.

౩౬ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాదు.

౩౭ టేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు – నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3–0–0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 3 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0 | 4 | 0 |
| 4 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 5 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) ... | 0 | 2 | 0 |
| 6 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 7 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 8 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 9 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 10 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | 0 | 8 | 0 |
| 11 | వత్సలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 12 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | 0 | 3 | 0 |
| 13 | పశ్యశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 14 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 15 | శంతనురాజచరిత్ర ... | 0 | 14 | 0 |
| 16 | వర్ణవ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 17 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 18 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 19 | అభినవశాకుంతల నాటకము ... | 0 | 8 | 0 |
| 20 | సూతసంహిత-ఆంధ్రము ... | 2 | 0 | 0 |
| 21 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 | 0 |
| 22 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 23 | డిటో నాగరఖండము (3 సంపుటము) | 1 | 8 | 0 |
| 24 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 25 | ధర్మనిర్ణయము. | 0 | 4 | 0 |
| 26 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,

గుంటూరు జిల్లా.